

మిత్రుడు - సహృదయుడు

మా

తాడపనేని లక్ష్మీనారాయణకు



# కృతజ్ఞతలు

—///—

ఈ కథల అనువాదానికి నన్ను ప్రోత్సహించి ఉత్సాహ పరచిన నా మిత్రులు శ్రీయుతులు ఆచార్య V. శ్యామ సుందరదేవ్, బొబ్బా కృష్ణమనోహరరావు, నందిపాటి వీరా రెడ్డి, నడకుదురు విశ్వనాథరావు, D. V. R. హనుమంత రావు, దండమూడి రాజరాజనరేంద్రుడు, స్థానం రామారావు కాకాని సత్యనారాయణరావు, బుద్ధిరాజు లక్ష్మణరావు, కొడాలి వీరవరప్రసాదుగార్లకు—

ఈ కథలు శ్రద్ధగా పరిశీలించి సవరించిన మిత్రుడు శ్రీ మోటూరి వేంకటేశ్వరరావుకు—

నా కోరికపై ఈ కథాసంపుటిని పాఠకలోకాని కంద జేస్తూన్న కంభంమెట్టు సత్యనారాయణగారికి (కె. యస్. ఆర్. అందు సన్సు), తదితర మిత్రులకు—

ముద్రారాక్షసులులేకుండ చక్కగా అచ్చొత్తించి యిచ్చిన భారతముద్రణాలయమువారికి—

నా హృదయపూర్వకాభివందనములు.

—వేంకటేశ్వరరావు.

# దాగుడు మూతలు

నిన్న రోజంతా తెరపివ్వకుండా వర్షం తన ఇష్టం వచ్చినట్లు కుండపోత పోసింది. ఇవాళ ఆకాశంలో మేఘాలు చూద్దామన్నా కానరాకుండా మాయమయ్యాయి. ఆకాశం నిర్మలంగావుంది. ఊరిచుట్టూవున్న వరిచేలు ఇంకా పొట్టకు రాలేదు. ఆ పొలాలు ఇప్పుడిప్పుడే గుబురుగా పెరుగుతూ బాగా దుబ్బు కట్టి నల్లగా నిగనిగలాడుతున్నాయి. ప్రాతః కాలపు సూర్యకిరణాలు, మేఘాలు ఆకాశంలో దాగుడు మూత లాడుకొంటున్నాయి. వాటి నీడలు పొలాలపై పడి వివిధ వర్ణాలను చిత్రిస్తూ కనులపండువు చేస్తున్నాయి. కుంచె తీసుకుని ఎవరో అనంతమైన ఈ ప్రకృతి చిత్రఫలకంమీద ఏవేవో రంగురంగుల చిత్రాలు చిత్రిస్తున్నారా అనిపిస్తోంది ఆ దృశ్యం. కనుచూపుమేర వ్యాపించివున్న ఆ పొలాలు సూర్యకిరణాల కాంతిలో ఉజ్వలంగా ప్రకాశిస్తున్నాయి. ఆ సూర్యకిరణాలకు మబ్బు తెప్పలు అడ్డుపడినప్పుడు నిగనిగ లీనుతున్న ఆ చేలు మరింత నలుపెక్కుతున్నాయి.

అనంతమైన ఆకాశపు రంగభూమిలో మబ్బుతెప్పలు, ఎండపొడలు నటీనటులమాదిరిగా తమతమ పాత్రోచితాభి

నయాలు ప్రదర్శిస్తున్నాయి. ఇక ప్రపంచ నాటకరంగ స్థలంలో ఎన్నెన్ని అభినయాలు అభినయించబడుతున్నాయో ఎవరు చెప్పగలరు !

ఒకానొక చిన్న జీవనలీల అభినయించబడుతున్న చోట మనం ఇప్పుడు తెర తొలగించి చూదాం. అది బజారువైపునవున్న ఇల్లు. బజారువైపు గది రాతితో కట్ట బడింది. మిగతావన్నీ మట్టిగోడలు. ఇంటిచుట్టూవున్న ప్రహరీ శిథిలమై పడిపోతున్నది బజారువైపువున్న కిటికీ చువ్వలలోంచి చూస్తే, ఉక్క, ఈగలబాధలను భరించలేక ఎడమచేతిలోని విసనకర్రతో విసురుకుంటూ, కుడిచేతిలోని గ్రంథాన్ని అత్యంత కుతూహలంగా పఠిస్తున్న ఒక నవ యువకుడు కనిపిస్తాడు.

ఇక బజారులోనికి వద్దాం. డోరియా పరికిణీ కట్టుకున్న ఒక బాలిక తన ఓణీ కొంగులో నేరేడుపండ్లు పోసుకొని, వాటిని ఒక్కొక్కదాన్నే తీసి తింటూ, బజారులోకీ కిటికీ దగ్గరకు అదేపనిగా కాలుకాలిన పిల్లిలా తిరుగుతోంది. గది లో కూచుని పుస్తకం చదువుకుంటున్న ఆ యువకునికి ఆ బాలికకు ఏదో సన్నిహిత సంబంధం వున్నదని ఆ బాలిక ముఖ కవళికలు, హావభావాలు వ్యక్తంచేస్తున్నాయి. ఎలా గైనా సరే; ఆ యువకుని దృష్టి నాకర్షించి " నే నిప్పుడు నేరేడుకాయలు తినటంలో నిమగ్ననై యున్నాను. పో; నీతో నాకు అవసరమే లేదిక " అని ఆ యువకుని హేళన చేయటానికి పాప మా బాలిక నానా అవస్థలు పడుతోంది.

లోపల గ్రంథపఠనం గావిస్తున్న ఆ యువకునకు కొద్దిగా దృష్టిమాంద్యం వుంది. అందుచేత మాటా మంతీ లేని ఆ బాలిక హావభావాలు అతనిని ఆకర్షించలేకపోతున్నాయి. ఎంతకూ ఆమె ప్రయత్నాలు ఫలించలేదు. చివరకు ఇంకొక కొత్త ఎత్తువెత్తింది. అతనిదృష్టి నాకర్షించడానికి తాను తిని పారేసిన నేరేడు గింజలను ప్రయోగించసాగింది. గ్రుడ్డివారి ముందర మాటమంతీలేకుండా తమ ప్రతిభను ప్రదర్శించుకో గలగడం అతికష్టం.

వెంటవెంటనే వచ్చిపడుతున్న నేరేడు గింజలు కిటికీ చువ్వలకు తగిలి చప్పుడు చేస్తున్నాయి. ఆ చప్పుడు విని ఆ యువకుడు ఒకసారి తలెత్తి చూచాడు. ఆ జిత్తులమారి కిలాడి అది కనిపెట్టింది. తన కేమీ తెలియనట్లుగా తలొంచుకొని ఒడిలోని నేరేడుకాయలను ఏరుకుంటున్నట్లుగా నటిస్తోంది. దృష్టిమాంద్యుడు కావడంచేత బాగా కనురెప్పలెత్తి చూచాడు. అతిప్రయత్నంమీద ఆ బాలికను గుర్తుపట్టగలి గాడు. చేతిలోని పుస్తకం మూసేసి కిటికీదగ్గరకువచ్చి మంద హాసం చేస్తూ 'గిరిబాలా!' అని పిలిచాడు.

ఆ పిలుపుకు గిరిబాల ఆనందపరవశురాలైంది. కాని తన ఆనందాన్ని అణుమాత్రంకూడా బయటకు పొక్కనీయ కుండా దాచుకొని, అడుగులో అడుగువేస్తూ నెమ్మదిగా నడుస్తోంది.

ఏదో అజ్ఞాత అపరాధానికిప్రతిఫలంగా ఇప్పుడు తా నీ శిక్షకు గురౌతున్నట్లు గ్రహించటానికి ఆ యువకునికి ఎంతో

సేపు పట్టలేదు. గదిలోంచి ఆదరాబాదరా బయటకువచ్చి "గిరీ, ఇవాళ నాకు నేరేడుకాయలు పెట్టలేదేం!" అన్నాడు. గిరిబాల అతని మాటలను వినికూడా వినిపించనట్లుగా నటించింది. ఒడిలోనుంచి నేరేడుపండొకటి తీసి అతనిని వూరిస్తూ తినసాగింది; ఆప్యాయంగా.

ఆ నేరేడుపండ్లు ఆమెస్వంత పెరట్లోవేకావచ్చు. కాని వాటిలో రోజూ ఆ యువకునికికూడా భాగం లభిస్తుంటుంది. కాని ఎందుకనో ఆ సంగతి గిరిబాలకు నేడు గుర్తేలేదు. ఆ కాయలను తన ఒకర్తె కోసరమే తెచ్చుకున్నట్లుగావుంది; ఆమెధోరణి. కాని ఆ విధంగా పరాయివారి ఇంటిముందుకు వచ్చి వూరిస్తూ తినవలసిన అవసరమేమిటో? బోధపడకుండా వుంది. ఎంతపిలిచినా గిరిబాల దగ్గరకు రాకపోయేసరికి ఆ యువకుడు చివరకు తనే వెళ్ళి ఆమె చేయి పట్టుకున్నాడు. చేయి విడిపించుకోవటానికి ఆమె మొదట్లో కొంతసేపు ఇటు నటు పెనుగులాడింది. కాని విడిపించుకోలేకపోయింది. చివరకు బిగ్గరగా ఏడ్చింది. కొంగులోని నేరేడుపండ్లను అక్కడే క్రింద పారబోసి తప్పించుకొని పారిపోయింది.

పగలు ప్రొద్దస్తమానం ఆకాశంలో పోటాపోటీలుగా పరుగులు తీసిన చంచలమగు మబ్బుతెప్పలు, ఎండ పొడలు సాయంత్రానికి వినీలాకాశంలో ఒకచోట చేరి ప్రశాంతంగా అలసట తీర్చుకుంటున్నాయి. కుప్పలు కుప్పలుగా ఒక మూలకు చేరుకుంటున్న బూడిదవర్ణపు మబ్బుల నీడలు, సంధ్యా సమయపు అరుణ కాంతులు చెట్ల ఆకులు, చెరువు లోను, ప్రకృతికన్య అంగ ప్రత్యంగాలమీద పడి వింత

వింత కాంతులతో ప్రకాశిస్తున్నాయి. ఆ బాలిక మళ్ళీ బజారువైపు గది కిటికీముందర పచార్లు చేస్తోంది. ఆ యువకుడు ప్రొద్దుటిలాగే గదిలోపల కూర్చొని వున్నాడు. ప్రొద్దుటికీ ఇప్పటికీ వ్యత్యాసమల్లా ఇప్పుడా బాలిక వడిలో నేరేడుకాయలు, యువకుని చేతిలో పుస్తకమూ, రెండూ లేవు. అంతే. కాని దీనిలో ఏదో నిగూఢరహస్యం నిక్షిప్తమై వుందనిపిస్తోంది.

ఈ పూట మళ్ళీ ఆ బాలిక అక్కడ ఎందు కలా తారట్లాడుతుందో చెప్పటం కష్టం. ఇంకేమైనా వూహించవచ్చు కాని ఆమెకు లోపలవున్న యువకునితో మాట్లాడవలసిన అవసర మున్నదని అనుకోవటానికి ఏమాత్రం అవకాశం లేదు. బహుశా ప్రొద్దున తను పారబోసి పోయిన నేరేడుపండ్లు మొలిచి మొక్కెత్తాయేమో! చూచి పోదామని వచ్చింది కాబోలు!!

కాని ఆ కాయలు తను పారబోసిన చోట లేవు. అవి అన్నీ ఆ యువకుని ముందర బల్లమీద ప్రోగుపడి వున్నాయి. ఆ బాలిక అక్కడ దేనికోసమో వెతుక్కుంటోంది. అప్పుడా యువకుడు గదిలో కూర్చొని పెల్లుబికి వస్తున్న నవ్వాపుకుంటూ గంభీరంగా నేరేడుపండ్లు తింటున్నాడు. గింజలను బయటకు విసిరి పారేస్తున్నాడు. ఒకటి రెండు గింజలు ఆమె కాళ్ళకు వచ్చి తగిలాయి. దాంతో తెప్పరిల్లుకుంది. ప్రొద్దున తాను చేసిన దానికి ప్రతిఫలంగా ఇప్పుడాతడు తనమీద కసి తీర్చుకుంటున్నాడని భావించింది; గిరిబాల. కాని అతని కిది న్యాయమేనా? తను స్వాభిమానాన్నికూడా వదులుకొని

ఆతనికి లొంగిపోవటానికై వచ్చింది. అలాంటప్పుడు ఎంత కఠినుడు కాకపోతే అత నిలా ప్రవర్తిస్తాడు? లొంగిపోవటం కోసరం వచ్చిందన్న విషయాన్ని ఆ యువకుడు గ్రహించ టంతోనే గిరిబాల ముఖం క్రమక్రమంగా సిగ్గుతో జేవు రించింది. ఇక అక్కడనుంచి పారిపోవడానికి ప్రయత్నిస్తోంది. కాని ఇంతలో అతను గదిలోనుండి బయటకువచ్చి చెయ్యి పట్టుకున్నాడు.

ప్రొద్దుటిలాగే తప్పించుకోవడానికి చాలాసేపు ప్రయ త్నించింది. కాని ఈసారి ఏడ్వలేదు. సిగ్గుతో జేవురించిన ముఖాన్ని ఆతని వీపువైపుకు త్రిప్పి బిగ్గరగానవ్వుతోంది. ప్రేక్షకులదృష్టికిమాత్రం కేవలం లొంగిపోయిన ఖైదీ కారా గారంలో ప్రవేశిస్తున్న మాదిరిగా గిరిబాల ఇనుపవూచల కిటికీ వెనుకవైపుగదిలో ప్రవేశించింది.

ఆకాశంలోని మేఘాలు, ఎండపొడల దాగుడుమూతల ఆటల మాదిరిగానే భూమిమీద వీరిద్దరి ఆటలుకూడా సాధా రణమైనవేకావచ్చు. మేఘాలు ఎండపొడలలాగే వీరి ఆటలు కూడా క్షణభంగురాలు. నిజానికి ఆకాశంలో మేఘాలు ఎండ పొడలు కలసి జరుపుతున్న దోబూచులాటలు సాధారణమై నవి కానేకావు. అవి అసాధారణమైనవి. అస లవి ఆటలు కావు. ఆటలమాదిరిగా కనిపిస్తాయి. అంతే. వాటిలాగే ప్రపంచంలో నిత్యమూ సంభవిస్తున్న, లక్షలాది సంఘటనలముందర ఈ ఇద్దరి ఆటలు అప్రధానమైనవికావచ్చు; కాని అవి అప్రధాన మైనవి కానేకావు. నిశ్చలగంభీరచిత్తంతో అనాదికాలం నుండి యుగానికి ఇంకొకయుగాన్ని జతపరుస్తూ కాలచక్రాన్ని

త్రిప్పుతూవున్న అదృశ్యరూపుడైన ఆ విధాతయే, ఈ ఉదయ సాంధ్యలలో నవ్వులు ఏడ్పులు కల్పించి, తద్వారా ఆ బాలికలో జీవితవ్యాప్తమయిన సుఖ దుఃఖ బీజాలను అంకురింప జేస్తున్నాడు. ఆ బాలికలో అకారణంగా జనించిన ఈ అనవసర పట్టుదల, అహంకారం కేవలం ప్రేక్షకులకేకాక ఈ గాథకు ప్రధానపాత్రధారియగు ఆ యువకునికి కూడా అసహ్యం కలిగించింది. ఆ బాలికకు ఒకప్పుడు అతనిమీద అంతులేని కోపం కలుగుతుంది. ఇంకొకప్పుడు అపరిమితమయిన దయ పుడుతుంది. వేరొకప్పుడు రోజుటిలాగే అతని వాటా అతనికి తెచ్చియిస్తుంది. మరియొకప్పుడు ఏమైనాసరే ఇవ్వకూడదని మొండికేస్తుంది. ఆ బాలికలో ఇలాంటి భావాలు అసలెందుకు ఉత్పన్నమవుతాయో? అందుకు కారణం లభించదు. ఒక్కొక్కసారి ఆ బాలిక ఎంతో నేర్పుతోను, వుల్లాసంతోను తన యావత్ శక్తినీ వుపయోగించి అతనిని రంజింపజేస్తుంది. కోపంవచ్చినప్పుడు తనలోని కాఠిన్యాన్ని కూడదీసుకొని అతని హృదయాన్ని గాయపరచడానికి ప్రయత్నిస్తుంది. ఆ ప్రయత్నాలు విఫలమైనప్పుడు ఆ కాఠిన్యం ప్రళయరూపం ధరిస్తుంది. సఫలమైనప్పుడు ఆ కాఠిన్యం అంతా పశ్చాత్తాపాగ్నిలో మంచులా కరగి కన్నీరై సుస్థిరస్నేహజలం వర్షిస్తుంది.

మేఘాలు, ఎండపొడల చిద్విలాస గాథను వినిపించడానికే ఈ కథ కల్పించాను.

## 2

గ్రామస్తులందరు కాడిగట్ల తగాయిదాలు, గూడు పుఠాణీలు, కుట్రలు, కూట సాక్ష్యాలతో క్రిందుమీదవుతు న్నారు. ఆ తగాయిదాలను పట్టించుకోకుండా ఏదో పిచ్చాపాటీ మాట్లాడుకోవడానికి ఇక వూరిలో మిగిలిందల్లా గిరిబాల, శశిభూషణ్ వీ రిద్దరుమాత్రమే.

గిరిబాల వయస్సు పది సంవత్సరాలు వుంటుంది. ఇక శశిభూషణ్ ఆ సంవత్సరమే యం.ఏ., బి.యల్. పరీక్షయం దు త్తీర్ణ డయాడు. యువకుడు. ఇద్దరూ ఇరుగు పొరుగు వాసులు. అంతే. అందువల్ల వారిద్దరి సాంగత్యాన్ని చూచి ఇతరులు చెవులు కొరుక్కోవలసిం దేమీా లేదు.

గిరిబాల తండ్రి హరకుమార్ ఒకానొకప్పుడు ఆ వూ రందరిలోకి గొప్ప భూస్వామి. మంచి స్థితిపరుడు. చెడు రోజులు దాపరించాయి. ఆ స్తంతా హారతికర్పూరంలా హరించిపోయింది. పాపం! ఏంచేస్తాడు ? బ్రతుకు తెరువు కోసం జమీాందారుదగ్గర ఆ పరగణాకే కరణంగా కుదిరాడు

శశిభూషణ్ యం. ఏ., ప్యాసయ్యాక "లా" కూడా చదివి ప్యాసయ్యాడు. కాని అతనికి లోకానుభవం లేదు. ఎవరితోను కలవడు. సభా సొసైటీలతో అతనికి సంబంధమే లేదు. కాస్త దృష్టిమాంద్యం వుండడంచేత ఎవరినీ త్వరగా గుర్తుపట్టలేడు. అందువల్ల బాగా రెప్పలెత్తి చూచేవాడు. దానినే ప్రజలు అహంభావ మనుకునేవారు.

కలకత్తాలాంటి మహాపట్టణంలో ఇరుగు పొరుగులతో సంబంధం లేకుండా ఏకాకిగా జీవించవచ్చు. కాని ఇక్కడ

ఈ పల్లెటూళ్ళలో అలా ఏకాకిగా జీవించడం అసాధ్యం. అది గ్రామీణులకు గర్వంగా కనిపిస్తుంది. ద్వేషాలను పెంచుతుంది. ప్రాక్టీసు పెట్టించి కొడుకును ప్రయోజకుడిని చేయాలని శశిభూషణ్ తండ్రి, ఎన్నో ప్రయత్నాలు చేశాడు; కాని లాభం లేకపోయింది. అతని ప్రయత్నాలు ఫలించలేదు. ఇక చివరకు అలాఅన్నా దోవకువస్తాడేమోనని, సంసార బాధ్యతలు అప్పగించాడు. కాని శశిభూషణ్ గ్రామస్థుల వల్ల వుపేక్షింపబడినాడు. వారు అలా వుపేక్షించడానికి కూడా కారణంవుంది. అదేమంటే శశిభూషణ్ కు పెళ్ళంటే అసలు ఇష్టంలేకపోవడం. పిల్లనిద్దామని ఇంటికివచ్చిన పిల్ల తలిదండ్రులు వాని ఈ అయిష్టతను దుస్సహ అహంకారంగా భావించి పట్టరాని కోపంతో నానామాటలు ముఖాన్నే అనేసి పోయేవారు.

నిత్యమూ వస్తున్న ఇలాంటి విపత్తులనుండి తప్పించుకోవడానికి శశిభూషణ్ ఇంట్లోంచి బయటకురావడం మానుకున్నాడు. ఆ బజారు ప్రక్క గదిలో బల్లమీద ఇంగ్లీషు పుస్తకాలు ఇన్ని ముందరేసుక కూర్చుంటాడు. ఎల్లప్పుడూ ఒక్కటే చదువు. ఆ ఆస్తి ఏమయిపోయినా సరే; దాన్ని గురించసలు పట్టించుకోనే పట్టించుకోడు.

ఆ వూరిలో అతనికి ఎవ్వరితోనన్నా సంబంధం వుందంటే అది ఒక్క గిరిబాలతో మాత్రమేనని పాఠకులకు ఇంతకు ముందే చెప్పబడింది.

గిరిబాల అన్నలు స్కూల్లో చదువుకుంటున్నారు. స్కూలునుండి వస్తూనే 'భూమి ఏ ఆకారంగా వుంది?' అని

ఒకనాడు, 'సూర్యుడు పెద్దా? భూమి పెద్దా?'అని ఇంకొకనాడు అమాయకురాలైన గిరిబాలను పిలిచి అడుగుతుండేవారు. ఆ ప్రశ్నలకు పాపం గిరిబాల తప్పుజవాబు చెప్తే వారు ఆమెను పరిహసించేవారు. 'సూర్యుడు భూమి కంటె పెద్ద'అని తన అన్నలు సప్రమాణంగా నిరూపించలేదని సందేహం కలిగినప్పుడు గిరిబాల నిర్మొహమాటంగా తన సందేహాన్ని వెలిబుచ్చేది. అప్పుడు అన్నలు ఆమెను హేళనచేస్తూ "చాలుచాల్లే మహాచెప్పొచ్చావు వెళ్ళు! ఇదిగో ఇలాచూడు, మా పుస్తకాలలో వ్రాసుంటేను! నువ్వుకాదనే..."అనే వారు.

అచ్చుపుస్తకాలలో వ్రాసుందని విని అంతకంటె మరింకేమి ప్రమాణం కావాలని మాట్లాడకుండా వూరుకునేది గిరిబాల.

గిరిబాలకు అన్నల్లాగా తనూ చదువుకోవాలని చాలా కోరికగా వుండేది. ఒక్కొక్కనాడు వారి పుస్తకాలలోనుంచి ఏదో పుస్తకాన్ని పట్టుకవచ్చి ఏకాంతంగా కూర్చునేది. చదువుతున్నదానిలా నటించి గబగబ పేజీలు తిరగేస్తుంది. మధ్య మధ్య ఏదో బడబడ వాగుతుంటుంది. తమ తమ భుజాలమీద గుడులు, జౌత్యాలను ఎక్కించుకొని మోస్తున్న నల్లని చిన్నచిన్న ఆ అపరిచిత ముద్రాక్షరాలు, విశేషమైన రహస్యమందిర సింహద్వారంముంగిట వరుసలు వరుసలుగా నిలచిన పహారాదార్లుగా కనిపించేవి గిరిబాలకు. కథామాల దానిలోని పులులు, సింహాలు, కుక్కలు, నక్కలు, గాడిదలు, గుర్రాలు. వాటిలో ఏ ఒక్కటీ తమలో నిక్షిప్తమైవున్న రహ

స్యాలను అత్యంత కుతూహలంతో చూస్తున్న ఆ బాలికకు తెలియనిచ్చేవికావు తన పుటలలో అంతర్నిహితాలై వున్న ఏ ఒక్క కథను వెలికి రానీకుండా లోలోపలే దాచుకొని మూగనోముపట్టిన ముత్యపుచిప్పలాగా పులక్కుండా పల క్కుండా గిరిబాలముఖంకేసి చూస్తోంది కథామంజరి.

అన్నలముందర గిరిబాల తన చదువుముచ్చట తెచ్చింది. కాని వాళ్ళు దాన్ని గురించి అసలు పట్టించుకోలేదు. ఇక ఈ విషయంలో గిరిబాలకు సహాయపడింది శశిభూషణుడే.

'కథామాల' 'కథామంజరి'ల లాగే ఇంచుమించుగా గిరిబాలకు ప్రారంభంలో శశిభూషణ్ కూడా నిగూఢంగా కన్పించేవాడు. గిరిబాల బజార్లోంచి కిటికీగుండా లోనికి తొంగిచూచేది. పుస్తకాలదొంతర్ల ప్రక్కన కూర్చొని శశి భూషణ్ చదువుకుంటుండేవాడు. ఆ పుస్తకాల సంఖ్యను మనస్సులో వూహించుకొని శశిభూషణ్ తన అన్నలకంటే గొప్ప విద్వాంసుడని అనుకునేది. కథామాల ఆదిగాగల గ్రంథాలన్నింటిని శశిభూషణ్ చాలాకాలంక్రిందటే చదివేసి వుంటాడనడంలో ఆమెకేవిధమైన సందేహమూలేదు. అందు చేత శశిభూషణ్ ఆ పుస్తకాలపేజీలు అలా తిరగేస్తూ వున్న ప్పుడు ఆమె బజార్లో కిటికీప్రక్కన నిలబడి అత్యంతాసక్తితో పరిశీలిస్తుండేది.

చివరకొకరోజున ఆశ్చర్యచకిత గిరిబాల అతనిని ఆక ర్షించింది. శశిభూషణ్ ఒకనాడు బొమ్మలపుస్తకాన్ని ఒక దానిని తెరచి "గిరీ! రా; నీకు మంచి మంచి బొమ్మలు

చూపిస్తా!!'' అని పిలిచాడు. ఆమాట వినడంతోనే గిరిబాల ఎగిరిగంతేసి అక్కడనుంచి తుర్రున తూనీగలా పారిపోయింది.

ఆ మరునాడుకూడా డోరియా పరికిణీ ధరించి రోజటిలాగే ఆ కిటికీ ప్రక్కన నిలబడి, నిశ్చలమగు ఏకాగ్రచిత్తంతో శశిభూషణ్ చదువును పరిశీలించసాగింది గిరిబాల. ఆరోజు కూడా శశిభూషణ్ నిన్నటిలాగే పిలిచాడు. పిలుపు విని ఇవాళకూడా రాకుండా పారిపోయింది గిరిబాల.

ఈవిధంగా ప్రారంభమైన వారి తొలిపరిచయం ఎప్పుడు ఆత్మీయంగా పరిణమించిందో తెలియదు. కిటికీ వూచల వెలుపలినుంచి ప్రారంభమైన పరిచయం గదిలోపల ఆ పుస్తకాలమధ్య తేలియాడుతోంది. వారి కెప్పుడు ఆ దృఢ మైత్రి ఏర్పడిందో ఆ తేదీలు, ఘడియలు వివరంగా చెప్పాలంటే కొంతచారిత్రకాన్వేషణ జరగందే సాధ్యంగాదు.

గిరిబాల శశిభూషణ్ దగ్గర చదువుకుంటోంది. శశిభూషణ్ ఆ చిన్నారి శిష్యురాలికి ఒక్క అక్షరాలు, గుణింతాలు, వ్యాకరణం మాత్రమే చెప్పి వూరుకోవడంలేదు. గొప్ప గొప్ప కావ్యాల్లోంచి ప్రధాన ఘట్టాలను ఏరి వాటిని ఆమెకు అనువదించి చెప్పటమేకాకుండా వాటిపై ఆ బాలిక అభిప్రాయాలుకూడా అడుగుతుంటాడు. మరి ఆ వాక్యాలలో ఆ బాలిక కేం బోధపడేదో! ఆ రహస్యం ఆ సర్వాంతర్యామికే ఎరుక!! కాని వాటిని వినడానికి ఆ బాలిక అత్యుత్సాహపడుతుందనడంలో మాత్రం అనుమానానికి ఆస్కారమేలేదు. ఆ కావ్యాలలోని, నిగూఢరహస్యం ఆమె కర్థంఅయినా కాక

పోయినా ఆ బాలిక తన పసిహృదయంలో ఏవేవో వూహాలు అల్లుకుంటుంది. వినయవిధేయతలు వుట్టిపడేటట్లుగా కూర్చుం టుంది. శ్రద్ధాభక్తులతో ఆ చెప్పే విషయాలన్నీ వింటుంది. అప్పుడప్పుడు మధ్య మధ్య ఏవో అసంగత ప్రశ్నలను అడుగు తుంటుంది. ఒక్కొక్కప్పుడు వున్నట్లుండి అకస్మాత్తుగా తన చదువుకు అసలు సంబంధమే లేని ఏదో ఒక పిచ్చిప్రశ్న అడిగి వూరుకునేది. ఆ ప్రశ్నలు వింటే పాఠకులు తప్పక నవ్వుతారు. కాని శశిభూషణ్ మాత్రం ఆ ప్రశ్న లన్నిటినీ శ్రద్ధగా విని తనకు తెలిసినంతవరకు ఓపిగ్గా విడమరచి సమా ధానాలు చెప్పేవాడు. ఆ మహాకావ్యాలమీద ఈ అతి క్షుద్ర విమర్శకురాలు చేసే నిందా స్తుతీ, టీకా భాష్యాలు, వింటున్నంతసేపూ విశేషానందాన్ని పొందేవాడు శశి భూషణ్. ఆ గ్రామంలో ఒక్క గిరిబాలతప్ప సహృదయంతో తనను అర్థంచేసుకోగలిగినవా రెవ్వరూ లేరు శశిభూషణ్‌కు.

శశిభూషణ్‌కు గిరిబాలతో పరిచయ మేర్పడినప్పుడు ఆమె వయస్సు ఎనిమిది సంవత్సరాలు. ఇప్పు డామె పదేండ్ల అమ్మాయి అయింది. ఈ రెండు సంవత్సరాలలో ఆమె బెంగాలీ, ఇంగ్లీషు భాషలలో అక్షరాలు, గుణింతాలు నేర్చు కొని పేర్లు వ్రాయడమే కాకుండా నాలుగైదు చిన్నచిన్న కథల పుస్తకాలుకూడా చదివేసింది. శశిభూషణ్‌కుకూడా ఈ రెండు సంవత్సరాలు ఆ గ్రామీణజీవితం ఆనందంగానే గడిచింది.

# 3

కాని గిరిబాల తండ్రి హరకుమార్‌తో శశిభూషణ్‌కు శ్రుతి కలిసేది కాదు. మొట్టమొదటి రోజులలో సలహాకు హరకుమార్ శశిభూషణ్ వద్దకు వచ్చి పోతుండేవాడు. కాని శశిభూషణ్ ఆయన చెప్పే మాటలను చెవి దూరనిచ్చేవాడు గాడు. "లా"కు సంబంధించినంతవరకు తన కేమీ తెలియ దని చెప్పుకోవడానికికూడా శశిభూషణ్ వెనుకాడేవాడు కాదు. శశిభూషణ్ తప్పించుకోవడానికి పరిహాసంగా అలా అంటు న్నాడని అనుకునేవాడు హరకుమార్.

కొంతకాలంగా జమీందారీలో ప్రజలు చీటికి మాటికి తిరగబడుతున్నారు. వాండ్లను చెలరేగకుండా అదుపాజ్ఞలలో వుంచవలసిన అవసరం ఏర్పడింది కరణం హరకుమార్‌కు. ప్రజలమీద రకరకాల కేసులుపెట్టి వారిని కోర్టుల కెక్కిం చాడు హరకుమార్. ఆ కేసుల్లో సలహా లిమ్మని శశిభూష ణుని వేధించుక తినసాగాడు. కాని సలహా చెప్పకపోగా అతని కేవో శాంతవచనాలు వుపదేశించేవాడు. అవి హరకుమార్‌కు రుచించలేదు.

ప్రజలమీద పెట్టిన కేసులలో హరకుమార్‌కు వ్యతి రేకంగా తీర్పు లివ్వబడ్డాయి. కనీసం ఒక్క కేసులోకూడా ఆతనికి అనుకూలం జరగలేదు. అన్నింటిలోనూ హరకుమారే ఓడిపోయాడు. తన వ్యతిరేకులకు నిజంగా శశిభూషణే సలహా లిచ్చి సహాయ పడుంటాడని హరకుమార్ దృఢ విశ్వాసం. ఇలాంటివాడిని ఇంకా వూరిలో వుండనిస్తే చివరకు కొరివితో

తల గోకికోనవలసివస్తుంది. అందువల్ల ఎలాఅయినా సరే; సాధ్యమైనంత త్వరలో శశిభూషణుని గ్రామంనుంచి బహిష్కరించాలని చూస్తున్నాడు.

హరకుమార్ ప్రయత్నాల ఫలితంగా చివరకు ఊరిలో శశిభూషణ్‌కు ప్రతికూల వాతావరణ మేర్పడింది. ఒకొక్కప్పుడు గ్రామస్తులు శశిభూషణ్ పొలాలను మేపి పాడుచేసేవారు. ఇంకొకప్పుడు అతని గడ్డివాములకు నిప్పంటుకొనేది. కాడిగట్ల తగాయిదాలు కోర్టుకెక్కాయి ఇక పాలికాపులు పాలికౌలు ఇవ్వడం మానివేశారు. అంతేకాక పైగా ఎదురు తిరిగి శశిభూషణ్ మీదనే తప్పుడు దావాలు వేశేవారు! ఇంకా అప్పుడప్పుడు అనేక పుకార్లుకూడా వినిపిస్తుండేవి. శశిభూషణ్ రాత్రిళ్ళు గడపదాటి బయటకు వస్తే ఫలానావాడు అతనిని ఖూనీ చేయడానికి సిద్ధంగా వున్నాడని, రేపో మాపో ఇంటికికూడా నిప్పంటించబోతున్నాడనీ, ఇలాంటివే జరగబోతున్న వుపద్రవాలు ఇంకా ఎన్నో!!

ఇక ఊరిపోరు పడలేక చివరకు శాంతిప్రియుడు, అమాయకుడు, సాధువు అయిన శశిభూషణ్ ఊరొదిలి కలకత్తా వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు.

ప్రయాణ సన్నాహాలు పూర్తిచేసుకొని ఇక ఆరోజు కలకత్తాకు బయలుదేరుదా మనుకుంటుండగా, ఇంతలో జాయింటు మేజస్ట్రేటు ఆపూటే వచ్చి ఊరిలో మకాం వేశాడు. దొరగారి పెంపుడు కుక్కలు, గుర్రాలు, బిళ్ళ బంట్రోతులు, పోలీసు కానిస్టేబిళ్లు, వంటవాండ్లు, ఇంకా

తదితర నౌకర్లు ఆదిగాగల అడేగాళ్ళు బడేగాళ్ళతో ఊరంతా సందడిగా వుంది.

కోళ్లు, కోడిగుడ్లు, పాలు, పెరుగు, నెయ్యి వగైరా భోజన సామగ్రిని అవసరాలకు మించి పదింత లెక్కువగా పంపిస్తున్నాడు దొరగారి డేరాకు హరకుమార్ అత్యుత్సాహంగా. ఆ ఖర్చంతా జమీందారీ అతిథుల ఖాతాకు వ్రాస్తున్నాడు. కాని ఒకరోజు వుదయాన్నే దొరగారి నౌకరు హరకుమా రింటికి వచ్చి దొరగారి పెంపుడుకుక్కకు నాలుగు శేర్ల నెయ్యి కావాలి; ఇప్పించమని అడిగాడు. అదేమి దురదృష్టమో, ఏం ఖర్మోగాని అంత మితిమించి వస్తు సామగ్రులు సప్లయిలు చేస్తున్న హరకుమార్ కుక్కకు నాలుగుశేర్ల నెయ్యి కావాలంటంతోనే మండిపడి "దొరగారి కుక్క మా దేశవాళీ కుక్కలకంటె అదనంగా నెయ్యి త్రాగి హరాయించుకుంటే హరాయించుకోవచ్చు. కాని నెయ్యిలాంటి కొవ్వు పదార్థాన్ని మితిమించి తినిపించడం దాని ఆరోగ్యానికి అంత మంచిది కాదు." అని వుపదేశమిచ్చి నెయ్యి ఇవ్వకుండానే నౌకర్ని త్రిప్పి పంపించేశాడు.

నౌకరు వెళ్ళి వున్నవి లేనివి నాలుగు అబద్ధాలు సుబద్ధాలు కల్పించి చెప్పాడు. 'కుక్కకు మాంసం ఎక్కడ దొరుకుతుందని అడగడానికి కరణంగా రింటికి వెళ్ళాను. అక్కడ ఆయన నన్నవమానపరచాడు. అంతేకాదు, మిమ్మల్ని కూడా తూలనాడాడు.' అని చెప్పి ఆ నౌకరు హరకుమార్ మీద దొరకు కోపం కలిగించాడు.

అసలు బ్రాహ్మణుల జాత్యహంకారం తెల్లదొరలకు గిట్టదు. గోరుచుట్టుమీద రోకటి పోటన్నట్లు హరకుమార్ సాహసించి, తన నౌకరును అవమానపరిచాడని వినడంతోనే కోపంతో రౌద్రాకారం దాల్చాడు దొర. "వెళ్లి హరకుమార్‌ను వున్నపాళంగా పిలుచుకరమ్మని" ఆజ్ఞాపించాడు బంట్రోతును.

జవానును చూడగానే హరకుమార్ ప్రాణాలు పైనే పోయాయి. భయంతో గజగజ వణికిపోతూ మనస్సులో దుర్గామాయిని స్మరించుకుంటూ, హరకుమార్ దొరగారి గుడారం ముందు హాజరయ్యాడు దొర చరచరా అడుగులు వేసుకుంటూ గుడారంలోంచి బయటకు వచ్చాడు. "నీవు మా నౌకరును ఎందుకు అవమానపరిచావు?" అని అడిగాడు ఆవేశంగా.

కంగారుగా చేతులు జోడించి "అయ్యా! దొరగారి నౌకరును అవమానపరుస్తానా! పైగా నాకు అంత సాహసం కూడానా!! తమ నౌకరు కుక్క-కోసం నాలుగుశేర్ల నెయ్యి కావాలని అడిగాడు. అంతగా మితిమీరి తినిపిస్తే జబ్బుచేస్తుందని అన్నమాట నిజమే. అంతకుమించి నే నేపాపంఎరుగను. అలా మాటవరసకు అన్నానన్నమాటేగాని, వెంటనే నెయ్యి కొనితెమ్మని డబ్బిచ్చి నాలుగూళ్ళకు నలుగుర్ని పంపించాను." అని మనవిచేసుకున్నాడు హరకుమార్ ప్రార్థనా పూర్వకంగా.

ఏయే వూళ్ళకు ఎవరెవరిని పంపించావో పేర్లు చెప్పమని అడిగాడు మాజిస్ట్రేటు.

హరకుమార్ సమయానికి నోటికి వచ్చిన పేర్లేవో నాలుగు తడుముకోకుండా చెప్పేశాడు. ఆ వ్యక్తులు, ఆ వూళ్ళకు వెళ్ళారేమో భోగట్టాచేసిరమ్మని నౌకర్లను పంపించాడు దొర. ఆ వెళ్ళినవాండ్లు తిరిగి వచ్చేవరకు గుడారంలోనే కూర్చోమని ఆజ్ఞాపించాడు హరకుమారును.

ఆ వెళ్ళినవాండ్లు మిట్టమధ్యాహ్నానికి తిరిగివచ్చి నెయ్యికోసం అసలెవరూ ఏవూరు వెళ్ళనేలేదని చెప్పారు. ఇక అప్పుడు హరకుమార్ చెప్పేవన్నీ అబద్ధాలని, నౌకరు చెప్పిందే నిజమని నమ్మాడు మాజిస్ట్రేటు. వెంటనే బంట్రోతును పిలచి కోపంతో "ఈ గొడ్డును చెవుపట్టి గుర్రాన్ని పరుగెత్తించినట్టు గుడారంచుట్టూ పరుగెత్తించుకరమ్మని" ఆజ్ఞాపించాడు. బంట్రోతు వెంటనే ఆ హుకుం అమలు జరిపాడు.

నిముషాలలో ఊరిలో ఇంటింటికీ వ్యాపించిం దీవార్త - ఇంటికి వచ్చి అన్నాహారాలు మానేసి ముసుగు పెట్టుకొని పడుకున్నాడు హరకుమార్.

ఊరికి కరణం. అందుచేత హరకుమార్‌కు విరోధులు చాలా ఎక్కువగానే వున్నారు ఊరిలో. ఈ విషయం తెలియడంతోనే హరకుమార్ విరోధులు అత్యంతానందంతో వుప్పొంగిపోయారు. కాని కలకత్తా ప్రయాణ సన్నాహాలలో వున్న శశిభూషణ్ ఈవార్త విని, హరకుమార్‌స్థితికి జాలి పడ్డాడు. ఆ అధికారిమీద కోపంవచ్చింది. అతని శరీరంలోని రక్తం సలసల మసలుతోంది. ఆ రాత్రంతా శశిభూషణ్‌కు నిద్రేపట్టలేదు.

మరునాడు వుదయాన్నే శశిభూషణ్, పరామర్శించి పోదామని హరకుమా రింటికి వచ్చాడు. అతనిని గడపలోనే చూచి లేచి ఎదురుగావెళ్ళి శశిభూషణ్ రెండుచేతులు పట్టుకొని లబ్బున మొత్తుకున్నాడు హరకుమార్. దాంతో ఇక శశిభూషణ్ వుగ్రుడయాడు. దొరమీద పరువునష్టం దావా వేయండి. నేను మీ తరఫున వాదిస్తాను, అన్నాడు.

మాజిస్ట్రేటుమీద పరువునష్టం దావా తేవడానికి హరకుమార్ ముందు కొంచెం జంకాడు. కాని శశిభూషణ్ అతన్ని వదలిపెట్టితేనా!

ఆలోచించి చెప్తానన్నాడు హరకుమార్. కాని తనకు జరిగిన ఈ అవమానం, వూరందరికీ తెలిసిపోవడం, తన విరోధులు ఆనందపడడం చూచి సహించి వూరుకోలేకపోయా డిక. చివరకు దావా వేయడానికి నిశ్చయించుకొన్నాడు. శశిభూషణ్ ఇంటికివెళ్ళి "తమ్ముడూ, నీవు అనవసరంగా వూరొదిలి కలకత్తా పోతున్నావని విన్నాను. నీలాంటి సత్పురుషులు, వుదారహృదయులు వెళ్లిపోతే ఇక దిక్కెవరు మాకీవూరిలో. నీలాంటివాండ్లు వూరిలో వుంటే అంతేచాలు. మాలాంటి వారికి అండావుంటుంది, ధైర్యమూవస్తుంది. అకారణంగా నిన్నలా వెళ్ళనివ్వను. ఎంత ఖర్చయినా సరే వెనుకంజ వేయను. ఈ ఘోర అవమానానికి ప్రతీకారం చేసితీరాలి. ఈ వ్యవహారంలో సహాయపడి నన్ను ఒడ్డునపడేసేభారం నీదే బాబూ" అన్నాడు హరకుమార్.

# 4

ఈ లోకానికి వెరచి ఎల్లప్పుడూ ఆగదిలో ఏకాంతంగా కాలంగడిపే శశిభూషణ్, ఇవాళ తొలిసారిగా వకాల్తా పుచ్చుకొని కోర్టుకు హాజరయాడు అతని వాదాన్ని మాజిస్ట్రేట్ శ్రద్ధగా విన్నాడు. ఆతరువాత శశిభూషణ్‌ను తన ప్రయివేటు ఛేంబరుకు పిలిపించుకొన్నాడు. మర్యాదగా "శశిబాబు! ఈ అనవసరపు తగాయిదాలు ఎందుకు? ఈ కేసులో వాది ప్రతివాదు లిద్దరూ రాజీగా వ్యవహారం పరిష్కరించుకొంటే సరిపోదూ" అన్నాడు మాజిస్ట్రేటు.

అక్కడ డ్రాయరుమీదున్న 'లా' పుస్తకాన్ని తిరగేస్తూ "నా కక్షిదారుకు అలాంటి సలహా ఎలా ఇవ్వమంటారు! ఆయన నలుగురిలో బహిరంగంగా అవమానింపబడ్డారు, అలాంటప్పుడు ఈ వ్యవహారంలో గుట్టుగా రాజీ పడటం ఎలా సంభవం!" అన్నాడు శశిభూషణ్ సమాధాన పూర్వకంగా.

దూరదృష్టి లేని శశిభూషణుని ధోరణినిబట్టి ఇక అతనిని రాజీకి అంగీకరింపజేయటం అసాధ్యం అని గ్రహించాడు మాజిస్ట్రేటు. "ఆల్ రైట్, బాబూ, చూదాం, ఈ వ్యవహారం ఎందాక వెళుతుందో!" అన్నాడు.

కేసు దీర్ఘకాలం వాయిదా పడింది. మాజిస్ట్రేటు తనిఖీల నిమిత్తం గ్రామాలకు వెళ్ళిపోయాడు.

హరకుమారును అవమానించిన జాయింటు మాజిస్ట్రేటు "మేము మీ ఇలాకాకు తనిఖీకి వెళ్ళినప్పుడు అక్కడ

మీ కరణం హారకుమార్ మా నౌకరును అవమానపరచడమే గాకుండా, పై పెచ్చు నామీద కోర్టులో పరువునష్టం దావా వేశాడు. కనుక వెంటనే వానిని తగు విధంగా శిక్షిస్తారని భావిస్తాను” అని ఆ పరగణా జమీందారుకు జాబు వ్రాశాడు అధికారపూర్వకంగా.

ఆ జాబును చూడగానే జమీందారుకు చెమటలు క్రమ్మాయి. వెంటనే హారకుమారును పిలిపించాడు. జమీందారుగారితో మొదటినుంచి జరిగింది జరిగినట్లు అంతా విన్నవించుకున్నాడు హారకుమార్. జమీందారు కరణం హారకుమార్ చెప్పిందంతా విని వాడు నాలుగు శేర్ల నెయ్యి కావాలని అడిగినప్పుడు ఇవ్వకుండా నువ్వెందు కెదురుతిరిగాలి? అందులో నీ తాతసొమ్మేం తెచ్చి ఇవ్వటం లేదుగదా? మా సొమ్ము ఇవ్వడానికి కూడా అంత కష్ట మయిందా నీకు. అన్నాడు చిరాగ్గా.

అవును; నిజమే! తన స్వంత ఖజానా దోచిపెట్టడం లేదని హారకుమార్ అంగీకరించక తప్పింది కాదు. “ఒకర్ని అనేంలాభం? ఇంతకూ నా ఖర్మ మంచిదికాదు. లేకపోతే ఆ సమయానికి ఆ బుద్ధి నాకెందుకు పుట్టాలి” అని అను కున్నాడు హారకుమార్.

“ అవమానించింది చాలక ఎదురుతిరిగి దొరగారిమీద కోర్టులో పరువునష్టం దావాకూడా వేశావట. ఆ సలహా ఏ ప్రబుద్ధు డిచ్చాడేమిటి?” ప్రశ్నించాడు జమీందారు.

"ధర్మప్రభూ! వారిమీద దావా వేసే వుద్దేశ్యం నా కసలు లేనేలేదు. మావూరిలో శశిభూషణని ఒక చిన్న వకీలు వున్నాడు. తనకు బొత్తుగా కేసులు ఏమీ రావటం లేదని కాబోలు; ఆ కుర్రకుంక నానా ఇబ్బందులు పెట్టి పీడించి, ఇందులో నన్ను ఇరికించి నా కొంప ముంచాడు" అన్నాడు హరకుమార్.

ఆ మాటలు వినడంతోనే జమీందారు శశిభూషణుని మీద మండిపడ్డాడు. అస లతను ఎందుకూ పనికిరాని కొత్త వకీలు; ఎవరినో ఒకరిని లేవగొట్టి ఏదో ఒక కేసు పెట్టించి కాస్త అలజడి రేపితేగాని తన సంగతి నలుగురికీ తెలియదనుకున్నాడు. సందేహంలేదు! ఈ పని నిజంగా ఆ తుంటరి పెధవే చేయించుంటాడు. పాపం హరకుమార్ వుత్త అమాయకుడు. అతని కేమీ తెలియదు అని నమ్మాడు జమీందారు. సరే, జరిగిం దేదో జరిగిపోయింది. వెంటనే వెళ్ళి క్షమాపణలు చెప్పుకొని దావా ఎత్తేయించి దొరలు ఇద్దరినీ సంతృప్తి పరచు. అని ఆజ్ఞాపించి హరకుమారుని పంపించేశాడు.

హరకుమార్ రకరకాల పండ్లు, ఫలాలు, తియ్యని మిఠాయిలు, పర్బత్తులు తీసుకెళ్ళి జాయింటు మాజిస్ట్రేటు గారికి నజరానా ఇచ్చుకొని "తమమీద దావా వేయటానికి తాను అసలు అంగీకరించనే లేదని, వూరిలో కొత్తగా ప్లీడరు పట్టా తెచ్చుకున్న కుర్రకుంక తుంటరి చేష్టలవల్ల అలా జరిగిందని, ఇంకా ఏమేమో" మనవి చేసుకున్నాడు; మాజిస్ట్రేటుతో. ఆ మాటలకు శశిభూషణ్ మీద కోపం, హార

కుమార్ మీద జాలి కలిగింది మాజిస్ట్రేటుకు. "కోపతాపా లల్లో మిమ్మల్ని కష్టపెట్టినందుకు విచారిస్తున్నాం" అన్నాడు మాజిస్ట్రేటు.

"హుజూర్, తమరు పితృతుల్యులు. తెలిసో తెలి యకో పిల్లలు తప్పుచేసినప్పుడు తలిదండ్రులు శిక్షించటం ఎంతసేపు! మరల దగ్గరకు తీసి లాలించటం ఎంతసేపు! తండ్రి కుమారుని శిక్షించాడే అనుకోండి; అందుకు విచారించ వల సిన అవసర మేముంది?"

తదుపరి దొరగారి నౌకర్లను, చాకర్లను యథావిధి సంతృప్తి పరచి గ్రామాలకు తనిఖీల నిమిత్తం వెళ్ళిన మాజి స్ట్రేటుగారి దర్శనార్థం వెళ్ళాడు హరకుమార్. శశిభూషణ్ దుష్కృత్యాలను గురించి విని "అదా అసలుసంగతి; హర కుమార్ లాంటి పెద్దమనిషి కనీసం ముందుగా నాతో మాటమాత్రమన్నా అనకుండా దావా ఎందుకు వేశాడా! అని నాకే ఆశ్చర్యం వేసింది. మీరు అంగీకరించి వుండరు; ఇందులో ఏదో కీలకముందని అప్పుడే అనుకున్నాను ఇప్పుడిప్పుడు అంతా అర్థమవుతోంది. సరేగాని శశిభూషణ్ కాంగ్రెసు అభిమానా ఏమిటి?" అన్నాడు మాజిస్ట్రేటు. "అవునండీ" తడుముకోకుండా సమాధానం చెప్పాడు హర కుమార్.

దొర తన తీక్షణబుద్ధితో ఇదంతా ఆ కాంగ్రెసు వాళ్ళ పన్నాగ మనుకున్నాడు. ఏదో లేనిపోని దుమారం లేపి అమృతబజారు పత్రికలో ప్రభుత్వంమీద వ్యతిరేకత పుట్టిద్దా

మని కాంగ్రెసే ఇలాంటివాండ్లను వూళ్ళమీదికి ఎగతోలి అల్లర్లు చేయిస్తుంటుంది అని నిర్ణయించుకున్నాడు. ఈ కాంగ్రెసు చీడపురుగుల్ని కాళ్ళక్రింద రాసి నాశనం చేయడానికి తనకు చట్టం సర్వాధికారాలు ప్రసాదించనందుకు చిరాకు పడుతూ భారతప్రభుత్వ దుర్బలతకు లోలోనే దూషించుకున్నాడు. కాని కాంగ్రెసువాలా శశిభూషణ్ పేరును మాత్రం మరచిపోకుండా గుర్తుంచుకున్నాడు మాజిస్ట్రేటు.

# 5

ప్రపంచంలో పెద్దపెద్ద వ్యవహారాలు ప్రబలాతిప్రబలంగా విజృంభించినప్పుడు చిన్న చిన్న వ్యవహారాలుకూడా చాలా ప్రాధాన్యతవహిస్తాయి. అవి తమ పరిధిలో తాము ఈ ప్రపంచంలో తమ స్థానాన్ని నిరూపించుకోవడానికి ప్రయత్నిస్తుంటాయి.

హరకుమార్ గొడవలతో శశిభూషణ్‌కు క్షణం తీరిక వుండటంలేదు. 'లా' పాయింట్ల అన్వేషణకే సరిపోతోంది రోజంతా. కాల్పనిక్ కోర్టు నొకదాన్ని సృష్టించుకొన్నాడు. అభ్యాసంకోసం వుపన్యాసం ఇవ్వటం నేర్చుకుంటున్నాడు. వూహాజనిత కోర్టులోని ఆ జనసమూహంముందర తన వాదాన్ని వినిపిస్తున్నంతసేపు శశిభూషణ్‌కు ఒళ్ళంతా చెమటలు క్రమ్మేవి. వణుకుతున్న చేతులతో అప్పుడప్పుడు ముఖం మీది చెమట తుడుచుకుంటున్నాడు. ఈ వ్యవహారంలోపడి శశిభూషణ్ తన చిన్నారి శిష్యురాలు గిరిబాల చదువును గురించి పట్టించుకోవడం మానేశాడు. ఆమె నసలు పలకరించ

టమే లేదు. అయినా ఆ చిన్నారిచిట్టి విద్యార్థిని తన చిరుగుల పుస్తకం, సిరామరకల కాపీ పుస్తకాలు తీసుకొని వేళకు శశి భూషణ్ ఇంటికి వస్తుంది. ఆ పుస్తకాలతోపాటు తనకొంగులో పండ్లో, ఫలాలో, మిఠాయిలో ఏదో ఒక తినుబండారం తీసుకొచ్చుకుంటుంది.

మొదట కొన్నాళ్ళు బొమ్మలులేని ఏదో పెద్ద పెద్ద లావాంటి బైండుపుస్తకాలను ముందరవేసుకొని శశిభూషణ్ అత్యంతాసక్తితో ఆ పుస్తకంలో అదేపనిగా పేజీలు తిరగేస్తుండడం ఆమె గమనించింది. శశిబాబు ఇంతకుమునుపు పుస్తకాలలోంచి ఆమెకు చదివి వినిపించేవాడు. మరి ఇప్పుడు వినిపించడేం! ఇదివరకటిలాగా వాటిలో ఆబాలిక తెలుసుకోవలసిన విషయాలు లేవా? బ్రహ్మాండమైన ఆ 'లా 'పుస్తకముల ఎదుట గిరిబాల చిన్నబాలికయే కావచ్చు.

గిరిబాల గురువుగారి మనస్సును ఆకర్షించడానికి, జడతోపాటు శరీరాన్నికూడా కదులుస్తూ పెద్దగా దీర్ఘాలు తీసి పాఠాలు చదవసాగింది. కాని ఆ ప్రయత్నాలు ఫలించకపోయేసరికి ఆ లావాంటి నల్లని బైండు పుస్తకాలమీద ఆమెకు పట్టరాని కోపం వచ్చింది. వాటిని ఒక క్రూరుణ్ణి, హృదయహీనుణ్ణి చూచినట్లుగా చూడసాగింది. తన్ను అమాయక బాలికగా భావించి అవహేళన చేస్తున్న ఆ పుస్తకాలను ఏ గజదొంగ అయినా వచ్చి దొంగిలించుకుపోతే బావుండు. అమ్మను మాయపుచ్చి మంచి మంచి పిండివంటలు కాజేసుకొచ్చి ఆ దొంగకు బహుమతి యిస్తాను అని అనుకుంటుంది. చివరకా పుస్తకాలను నామరూపాలు

కూడా లేకుండా నాశనం చేయమని రోజూ ఎన్నో శాపనా ర్థాలు పెట్టేది. ఆ బాలిక గోడు ఆ భగవంతుడే ఆలకించ దలచనప్పుడు సహృదయ పాఠకులకు దాన్ని వినిపించిమాత్రం ఏం లాభం ?

వ్యధిత హృదయ అయిన ఆ బాలిక నాలుగురోజుల నుండి గురువుగారి దగ్గరకు రావడమే మానేసింది. అయిదవ రోజున ఆ నాలుగురోజుల ఫలితమేమిటో చూచిపోదామని, ఏదో పనిమీద అటు పోతున్నదానిలా వచ్చి, కిటికీలోనుంచి లోనికి తొంగిచూచింది గిరిబాల. రేపు కోర్టులో వాదించ డానికి ముందుగా అలవాటుకోసం ప్రయత్నిస్తూ విదేశీ భాషలో కిటికీ చువ్వలకు వుపన్యాసమిస్తున్నాడు శశిభూషణ్ గదిలో. మాజిస్ట్రేటును తన వాదాని కనుకూలం చేసుకోవ డానికి, శశిభూషణ్ తన వాక్చాతురిని వివిధ భంగిమలలో ముందుగా ఆ కిటికీ చువ్వలపై ప్రయోగించి పరీక్షించుకుం టున్నాడేమో ! బహుశా ! లోకజ్ఞానశూన్యుడైన శశి భూషణ్, ప్రాచీన కాలంలో డిమాస్థనీస్, సిసిరో, బర్క్, శెరిడిన్ మొదలైన మహావక్తలను అనుసరిస్తూ వుండొచ్చు. వారు తమ వాక్చాతుర్యంతో అనేక మహత్తర కార్యాలు సాధించగలిగారు. ఎప్పటి కప్పుడు నిశిత విమర్శలు చేస్తూ ఈ లోకంలో జరిగే అన్యాయాలను ఛిన్నా భిన్నం చేసి, అత్యాచారాలను అంతమొందించారు. అహంకారాన్ని మట్టిలో కలిపారు. కాని వారి కాలానికి, మనకాలానికి హస్తిమశకాంతరం తేడా వుందని తెలియదు పాప మా శశి భూషణ్‌కు. ప్రభుత్వమదగర్వితులు, దురంహంకారపూరితు

లైన ఇంగ్లీషువాండ్లను, నలుగురిలో ఎలా అవమానపరచా లనేదే అతడు తిలకుచి గ్రామంలో శిథిలావస్థలో వున్న ఆ ఇంటిలో అభ్యసిస్తున్నాడు. అంతరిక్షాన వున్న దేవతలు అతని చేష్టలకు ఆనందిస్తున్నారో, లేక పాపం అని కళ్ళనీళ్లే పెట్టుకుంటున్నారో ఎవరు చెప్పగలరు ?

రోజుటిలాగే ఒకనాడు గిరిబాల కిటికీదగ్గరకు వచ్చి నిలబడింది. కాని శశిభూషణ్ ఆమెవైపు కన్నెత్తి చూడను కూడా చూడలేదు. లోగడ ఒకసారి నేరేడు గింజలతో శశి భూషణ్ చేతికి చిక్కినప్పటినుండి, గిరిబాల వాటివిష యంలో, చాల జాగ్రత్తగా వుంటోంది. అందువలన మును పటిలాగా ఇప్పుడామె నేరేడు గింజలు ప్రయోగించడం మానేసింది. శశిభూషణుని ఆకర్షించడానికి ఇవాళ ఇంకొక కొత్త ఎత్తు ఎత్తి గభాలున ముఖ మటు ప్రక్కకు త్రిప్పి "స్వర్ణలతా, ఇదిగో నేనూ వస్తున్నాను. అక్కడే వుండు" అని పెద్దగా కేకలువేసి చెపుతోంది గిరిబాల.

ఆ బజారున స్వర్ణలత అనే స్నేహితురాలు వెళుతోం దని, నిజంగా ఆ బాలిక ఆమెను వుద్దేశించే పిలుస్తోందని, వూహించుంటారు పురుష పాఠకులు. కాని అక్కడ ఎవరూ లేరని, ఆ సమీపానే వున్న ఎవరో స్నేహితుని దృష్టిని ఆకర్షించడానికి ఆమె అలా పిలుస్తోందని స్త్రీ పాఠకురాండ్రకు వూరకే తెలుస్తుంది. పాపం; ఆ అంధునిమీద ఆమె ప్రయోగాలు పారలేదు. ఆ పిలుపు శశిభూషణ్ చెవికూడా సోకింది కాని ఇంకొకనాడైతే శశిభూషణ్ ఆ బాలికను రమ్మనమని పిలిచేవాడే. కాని ఇప్పుడు శశిభూషణ్‌కు కావల

సింది గిరిబాల చదువుకాదు. మేజిస్ట్రేటును అవమానపరచడమే. అందువలన ఆమెను పిలవకుండా వూరుకున్నాడు.

నేరేడు గింజలలో ఒక గుణమున్నది. వరుసగా నాలుగు గింజలు గురి తప్పినా కనీసం అయిదవదన్నా తగిలి తీరుతుంది. కాని 'స్వర్ణ' కల్పిత సఖి అందువలన ఆమెతో 'ఇదుగో ఇప్పుడే వస్తున్నా' అని చెప్పిన ఆ మాటలు తొందరను సూచిస్తున్నాయి. ఇక వెంటనే అచ్చటినుండి కదలకపోతే అసలు 'స్వర్ణ' అస్తిత్వం మీదే ప్రతివారికీ సందేహం కలగడం సహజం. అందుచేత తన పాచిక పారకపోయేసరికి గిరిబాలకు ఇక అక్కడనుండి వెళ్ళిపోక తప్పలేదు. కాని పిలుపులో వున్న తొందర ఆమె అడుగుల్లో కనిపించడంలేదు. మరి అసలు నిజంగా 'స్వర్ణ' అక్కడుంటేగా వేగంగా అడుగులుపడడానికి. వెనక్కి తిరిగి చూచింది. ఎవరూ తనను చూస్తున్నట్లుగాని, వస్తున్నట్లుగాని కనిపించలేదు. దాంతో ఇంకా తనలో మిణుకు మిణుకుమంటున్న ఆ ఆశను కూడా నిరాశ చేసుకొని, శిథిలావస్థలోవున్న చేతిలోని కన్యాబోధిని పుస్తకాన్ని అప్పటికప్పుడు తుంపులు తుంపులుగా చించి ఆ నడిబజార్లో విరజిమ్మేసింది. సాధ్యంకాక పోబట్టిగాని సాధ్యమైతేనా! శశిభూషణ్ దగ్గర తను నేర్చుకున్న చదువునంతా, తినిపారేసిన నేరేడుగింజల్లా అతని గడపముంగిట విసిరిపారేసుండేది. శశిభూషణ్ తిరిగి తనతో మాట్లాడేసరికి తనకు వచ్చిన చదువును మరచిపోయి అత నడిగిన ప్రశ్నలకు దేనికీ సమాధానాలు చెప్పకుండా వుండడానికి నిర్ణయించుకుంది గిరిబాల.

గిరిబాల నేత్రద్వయం అశ్రుజలంతో నిండిపోయాయి. తనకు వచ్చిన చదువును మరచిపోయినందువల్ల, శశిభూషణ్ పొందే పరితాపాన్ని వూహించుకున్నప్పుడు వేదనాభరితమైన ఆమె హృదయం వూరటజెందింది. కాని శశిభూషణ్ చేసిన తప్పుకు, తాను చదువంతా మరచిపోవడమా! అది ఆమెకు అసహ్య మనిపించింది. ఆకాశంలో మేఘాలు అలము కుంటున్నాయి వర్షాకాలంలో ఇది సహజమే. బజారులో చెట్టుక్రింద నిలబడి పాపం; గిరిబాల వెక్కి-క్కి- ఏడు స్తోంది. ఇలా అకారణంగా నిత్యమూ ఎంతమంది బాలికలు ఏడవటం లేదు! కాని వారి ఆ ఏడ్పులలో లేని ఏదో అనిర్వచనీయమైన ప్రత్యేకతమాత్రం వుంది; గిరిబాల ఏడ్పులో.

# 6

కేసు గెలిపించడానికి శశిభూషణ్ చేసిన ప్రయత్నాలు విఫలమయాయి అని పాఠకులకు ప్రత్యేకంగా తెలియజేయ వలసిన అవసరంలేదు. మాజిస్ట్రేటుమీద వేసిన దావా రాజీ జరిగింది. హరకుమార్ ఆ పరగణాకు ఆనరరీ మాజిస్ట్రేటుగా నియుక్తుడయాడు. మాసిపోయిన షేర్వానీ, తలపాగ ధరించి ప్రస్తుత మాయన దొరలకు సలాములుచేస్తూ, వారిచుట్టూ తిరుగుతున్నాడు.

ఇంతకాలంగా పెడుతున్న గిరిబాల శాపనార్థాలు ఫలించాయి. తత్ఫలితంగా పాపం; ఆ 'లా' పుస్తకాలు, ఇంట్లో ఒక చీకటిగదిలోపడి ఎవరికీ పనికిరాకుండా దుమ్ము

పట్టి మట్టిలో కలసిపోతున్నాయి కాని వాటికి సంభవించిన ఈ దుస్థితినిచూచి ఆనందించే గిరిబాల ఏదీ ? ఎక్కడుంది ?

పుస్తకాలను మూలన పడేసిన రోజునే శశిభూష ణుకు విశ్రాంతి లభించింది. అందాకా అసలు గిరిబాలమీద ధ్యాసేపోలేదు. ఆరోజున బల్లమీద కూర్చొని గిరిబాలను గురించి ఆలోచించసాగాడు. ఆమె తనఇంటికి రావడం మాను కుందని తెలిసింది. దాంతో గతకొలదిదినాలఘటనలు ఒక్కొ క్కటే వరుసగా గుర్తుకు రాసాగాయి. గిరిబాల ఒకనాడు వుదయాన్నే తొలకరి చినుకులకు తడిసిన పొగడపూలు వడి నిండా పోసుకొచ్చింది. సూదీ దారం కూడా తెచ్చింది. అప్పుడు తాను పుస్తకం చదువుకుంటున్నాడు. ఆమెను, చూచి కూడా పల్కరించలేదు. అప్పు డా బాలికకు దుఃఖం పొర్లుకొచ్చింది. ఒక్కొక్కపువ్వేతీసి సూదితో దండగ్రుచ్చ సాగింది. దండ పూర్తవడానికి చాలసేపుపట్టింది. బాగా ప్రొద్దెక్కింది. ఆమె తిరిగి ఇంటికి వెళ్ళేవేళకూడా అయింది. ఇంకా అప్పటికికూడా తను చదువు ముగించలేదు. చివరకు పెల్లుబికి వస్తున్న దుఃఖంతో ఆదండను అక్కడే బల్లమీద వుంచి వెళ్ళిపోయింది. ఆమె విచారం రోజురోజుకు ఎక్కువ కాసాగింది. రోజూ ఆ బాలిక వస్తూవుండడం, తాను చదు వులో మునిగివుండడం, కిటికీలోంచి లోనికి తొంగిచూచి తిరిగి వెళ్ళిపోవడం, ఇవన్నీ స్మృతికి వచ్చాయి. రాను రాను గిరిబాల అసలు రావడమే మానుకుంది. ఆమె రాక చాలా రోజు లైంది. గిరిబాల ఇన్ని రోజులు ఇక్కడకు రాకుండా వుండగలదా? ఆమె కోపం ఇంకా అలానేవుందా?

దీర్ఘ నిట్టూర్పు విడచి విచారంతో ఖిన్నుడై గోడకు చేరగిలబడి కూర్చున్నాడు శశిభూషణ్. గిరిబాల దర్శనం దుర్లభ మయేసరికి అతని కేమీ తోచటంలేదు. చదువు మీద పూర్తిగా విరక్తిపుట్టింది. పుస్తకం తెరచి ఒకటి రెండు పంక్తులు చదవగానే విసుగొచ్చేది. ఇక దా న్నవతల పారేసేవాడు. కూర్చుని వ్రాస్తూ వ్రాస్తూనే తలెత్తి చూచే వాడు. ఆ నేత్రద్వయంలో గాఢమైన నిరీక్షణాభావం, వేదనా గోచరించేవి. శశిభూషణ్ గిరిబాల రాకకోసం తపించిపోతున్నాడు.

జబ్బునపడిందేమోనని సందేహం కలిగింది. కాని ఎవరోన్న అడిగి తెలుసుకున్న మీదట, ఆమెకేమీ జబ్బు చేయలేదని, పెళ్ళికూడా నిశ్చయ మైందని, అత్తగారు పసుపు కుంకాలు పంపించారని, శుభముహూర్తంకూడా దగ్గిర పడిందని, అందుచేత గిరిబాలను, అసలు ఇంట్లోంచి బయ టకు రానీయడంలేదని తెలిసింది.

కన్యాబోధిని పుస్తకాన్ని తుంపులు తుంపులు చేసి బజార్లో విరజిమ్మేసిన మర్నాడు ప్రొద్దునే చెంగులో ఏవో పోసుకొని గిరిబాల ఇంట్లోంచి బయటకు వస్తోంది. బాగా వుబ్బతీయడంచేత హరకుమారుకు రాత్రంతా సరిగా నిద్ర పట్టలేదు. ఒళ్ళంతా బడలికగా వుంది. చుట్ట కాలుస్తూ అరుగు మీద కూర్చొని వున్నాడు. బయటకు వస్తున్న గిరిబాలను చూచి ఎక్కడికే? అని గద్దించి అడిగాడు. "శశి అన్నయ్యగా రింటికి" అన్నది గిరిబాల. ఆ మాట విని "ఛో; ఇంట్లోకివెళ్లు; ఈరోజునుంచి గడపదాటి బయటకుపోవడానికివీల్లేదు. ఇన్నేళ్లు

వచ్చాయి. అదీగాక రేపో మాపో పెండ్లి కాబోతోంది. ఆ మాత్రంకాస్త బిడియం వుండొద్దు. ఏండ్లు రాగానే సరా!" అని గిరిబాలను చివాట్లు వేశాడు హరకుమార్. ఆ రోజునుంచి ఆమె ఇక బయటకు రావడంలేదు. శశిభూషణ్ దగ్గరికివచ్చి అతనిమీద తనకు కోపంలేదని చెప్పడానికికూడా గిరిబాలకు అవకాశం లభించలేదు. వర్షాకాలం వచ్చింది. వానలు కురియ నారంభించాయి. పొగడపూలు విరియ బూచి రాలి పోతున్నాయి. క్రిక్కిరిసిన పండ్లతో జామిచెట్లు బరువుతో తలలు క్రిందికి వంచుకున్నాయి. ముదరపండిన నేరేడు కాయలు రాలి చిత్తొత్తుగా చెట్లక్రింద కుప్పలు కుప్పలు పడి వున్నాయి. కాని వాటిని ఏరుకోవడానికి గిరిబాల ఏదీ? ఇక ఆ పాత పుస్తకాన్ని ఇదివరకే చింపేసుకుంది.

## 7

గిరిబాల ఇంటిముందర మంగళవాయిద్యాలు మ్రోగు తున్నాయి. పెండ్లికి శశిభూషణ్‌కు కూడా ఆహ్వానం అందింది. కాని ఇవాళే శశిభూషణ్ వూరువిడచి కలకత్తా వెళ్ళడానికి ప్రయాణమయి సామానులు సర్దుకుంటున్నాడు.

తాను రాజీపడి చెప్పకుండా దావా ఎత్తేసుకున్నం దుకు, శశిభూషణ్‌కు తనమీద కోపం వుండితీరుతుందన్న పాడు అనుమానం పట్టి పీడిస్తోంది హరకుమార్‌ను. అందు వలన హరకుమార్ శశిభూషణుని ద్వేషంగా చూచేవాడు. దానికి తోడు శశిభూషణు ముఖంలో హరకుమార్‌కు కాల్ప నికమైన కోప చిహ్నాలు కనిపించేవి. అంతేకాదు; లోగడ

తనకు జరిగిన పరాభవ వృత్తాంతాన్ని క్రమక్రమంగా మిగిలిన వూరివారందరూ మరచిపోతుంటే, శశిభూషణ్ ఒక్కడే ఆ విషయాన్ని మరచిపోకుండా గుర్తుంచుకున్నాడని, హరకుమార్ భావించేవాడు. అందుచేత అతను శశిభూషణుని ఎదుటపడి పల్కరించలేకపోతున్నాడు. కాలఖర్మవశాత్తు ముఖాముఖి ఎదురుపడ్డప్పుడు హరకుమార్ అంతఃకరణంలో లజ్జాభిమానాలు ఒకేసారి వుత్పన్న మయేవి. కాని ఆ మరుక్షణంలోనే శశిభూషణ్ మీద వాని హృదయంలో కోపజ్వాలలు చెలరేగేవి. ఇక శశి భూషణుని వూరునుండి వెళ్లగొట్టించందే నిద్రపోకూడదని దీక్షవహించాడు.

శశిభూషణులాంటి అమాయకుణ్ణి వూరినుంచి వెళ్ళగొట్టడం అంతకష్టమేమీకాదు. హరకుమార్ కోరికకూడా శీఘ్రంగానే నెరవేరింది. శశిభూషణ్ ఒకనాడు ప్రొద్దున్నే, పుస్తకాలమూట, రెండు ట్రంకుపెట్టెలనిండా సామానులు సర్దుకొని పడవమీద కలకత్తా వెళ్ళిపోయాడు. ఆ పల్లెలో శశిభూషణ్‌కు ఆనందాన్ని చేకూర్చగలిగింది ఒక్కగిరిబాలే. ఈ పెండ్లి సంబరపు ఈ మంగళవాయిద్యాలు గిరిబాలను, శశిభూషణ్‌కు దూరం చేస్తున్నాయి గిరిబాల ఇక పరాయిదై పోతోంది. ఇంతవరకు వారిద్దరినీ గాఢంగా పెనవేసుకున్న కోమలస్నేహానుబంధాలకు విఘాతం ఏర్పడింది. ఆ కోమల స్నేహానుబంధం తనహృదయాన్ని ఎంత గాఢంగా పెనవేసుకువుందో శశిభూషణ్‌కు ఇంతకు ముందు అంతగా తెలియలేదు. కాని అతని కావిషయం ఇప్పుడు తెలుస్తోంది. నేడు తన పడవ రేవునువదలి దూరం పోతున్నకొద్దీ క్రమ

క్రమంగా దూరమవుతున్న వూరు, అస్పష్టమయిపోతున్న చెట్ల చిటారికొమ్మలు, క్షీణాతిక్షీణంగా వినిపిస్తోన్న పెండ్లి బాజాల అస్పష్టధ్వనులగురించి తలుచుకున్నకొద్దీ హృదయం తరుక్కుపోతోంది. ఏకధారగా ప్రవహిస్తోంది కన్నీరు. ఎక్కెక్కిఏడ్చాడు. గొంతు బొంగురుపోయింది. శరీరంలో రక్తనాడులు బంధించాయి. అందువల్ల ఈ ప్రపంచమంతా అతనికి ఎండమావుల్లాగా ఛాయామాత్రంగా కన్పిస్తున్నట్లుంది.

నదిలో ప్రవాహం అనుకూలంగానేఉంది. కాని తీవ్రంగా ఎదురుగాలి తాకిడికి నావ నెమ్మదిగా ముందుకు సాగిపోతోంది. ఇంతలో నదిలో సంభవించిన ఒకానొక చిన్న దుర్ఘటన శశిభూషణ్ ప్రయాణానికి అంతరాయం కలిగించింది.

స్టేషన్ ఘాట్ నుండి సదర్ మహకమావరకు ఒకక్రొత్త స్టీమరు వేశారు. దానికి మేనేజరు తెల్లదొర. స్టీమరు వేగంగా ప్రవాహానికి ఎదురు వస్తోంది. దానిలో ఆ యువకుడు, ఇంకా అయిదారుగురు ఇతర ప్రయాణీకులు తప్ప ఇంకెవరూ లేరు. వారిలో ఒకరిద్దరు శశిభూషణ్ వూరివాళ్ళుకూడా వున్నారు.

ఆ స్టీమరుతో పోటీగా నదిలో ఇంకొక నావకూడా ప్రయాణంచేస్తోంది. గాలి వడిగా వీచినప్పుడు అది అంతలో స్టీమరును దాటేస్తుంది. గాలివడి చావటంతోనే మళ్ళీ వెనక పడుతుంది. ఏమైనాసరే స్టీమరుతో పోటీచేయాలనుకున్నాడు నావికుడు. ఒకదానిమీద ఇంకొకటి వరుసగా మూడు తెర

చాపలు ఎత్తించాడు. గాలి తీవ్రతకు పొడుగాటి చాప స్తంభం ముందుకు వాలిపోయింది. పాయలు పాయలు చీలుతున్న నీటి కెరటాలు నావ కిరుప్రైపులా అట్టహాసంచేస్తూ మధుర ధ్వానులతో వున్మత్తనృత్యం చేస్తున్నాయి. కళ్లెం సడలించిన గుఱ్ఱంలాగా నావ శరవేగంతో పరుగులు తీస్తోంది. ఆ ఆంగ్లేయ యువకుడు స్టీమరులోనుంచి బయటకు తలపెట్టి ఆ పోటీని కుతూహలంగా తిలకిస్తున్నాడు. శరవేగంతో పరుగులు తీస్తున్న ఆ నావ చిటికెలో స్టీమరును తప్పించి పదిగజాలు ముందుకుపోయింది. ఆ తెల్లదొర ఇది సహించలేకపోయాడు. వెంటనే తుపాకి తీసి తెరచాపలకు గురిచూచి కాల్చాడు. ఇంకేముంది! తెరచాపలు పేలికలు పేలికలు అయాయి. నావ నదిలో మునిగిపోయింది. అక్కడ నది కొంచెం మలుపు తిరుగుతుంది. కనుమూసి తెరచే లోపుగా స్టీమరు ఆ మలుపు తిరిగి కనిపించకుండా అదృశ్య మయింది.

ఆ ఆంగ్లేయ యువకుడు ఎందుకలా ప్రవర్తించాడో చెప్పడం కష్టం. ఆంగ్లేయ నందనుల మనోభావాలు భారతీయులకు ఏమర్థమవుతాయి. వాటిమీద తుపాకి పేల్చడంలో బహుశా హింసాపూరిత దౌర్జన్య శక్తుల ప్రలోభమో, లేక పొగరుతో మదమెక్కి, ఆ తెరచాపలకు రెండుమూడు చిన్న చిన్న తూట్లు పొడిచి ఆ నౌకాలీలను అంతటితో పరిసమాప్తి పొందించడంలో ప్రబల పైశాచిక హాస్యరసమో వుంటే వుండవచ్చు. కాని ఖండితంగా అది ఇది అని తేల్చి చెప్పలేము. కాని అందుకు తా నేశిక్షా అనుభవించవలసిన అవసరం రాదన్న దృఢ నమ్మకంతోనే ఆ ఆంగ్లేయ యువ

కుడు ఈ పని చేశాడనటంమాత్రం ఖాయం. అంతేకాదు; నావతోపాటే నావలోని మానవులుకూడా ప్రాణికోటి లెఖ్కకు రారేమో !

దొర పేల్చిన తుపాకిగుండు తగిలి నావ నదిలో మునిగిపోతున్నప్పుడు శశిభూషణ్ ప్రయాణం చేస్తున్న నావ కూడా సరిగా అక్కడకు చేరుకుంది. వెంటనే తన నావను మునిగిపోతున్న నావవద్దకు మళ్ళించి ఆ కళాసులను, ప్రయాణీకులను తన నావలోకి ఎక్కించి కాపాడాడు. కాని నావ లోపల కూర్చుని వంటప్రయత్నాలు చేస్తున్న ఒక్క వ్యక్తిని మాత్రం కాపాడలేకపోయాడు. నది వర్షాకాలపు వరదలతో నురగలు క్రక్కుతూ మహాజోరుగా ప్రవహిస్తోంది.

శశిభూషణ్ కోపంతో కంపించి పోతున్నాడు. ఆతని శరీరంలో రక్తం కుతకుత లాడుతోంది చట్టం కండ్లులేని కబోది. దానికి హృదయం వుండదు. అది చిక్కులు చిక్కులుగా వున్న లోహయంత్రంలాంటిది. దానికి కావలసింది కేవలం సాక్ష్యాధారం. అంతకంటె నిజానిజాలతో పని లేదు. మానవ హృదయాలలోని కారుణ్యం దానిలో వుండదు. ఆకలి అన్నం కోరుతుంది. అభిలాష దానికి తగిన ఆధారాలతో పూర్తవుతుంది. క్రోధం దండన కోరుతుంది. కండ్లముందర అత్యాచారం జరుగుతున్నప్పుడు వెంటనే అపరాధులను దండించకుండా చూస్తూ చేతులు ముడుచుకు కూర్చోవడం కొందరికి చేతగాదు. అలా వూరుకున్నట్లయితే సృష్టికర్త తమను సర్వనాశనం చేసేస్తాడన్న భయం వుంటుంది వారికి. శశిభూషణ్ ఆ కోవకు చెందిన

వాడే. అలాంటి సమయాలలో న్యాయస్థానాలను అడ్డం పెట్టుకొని మనస్సును తృప్తిపరచుకొని వూరడిల్లడానికి బదులు మానవ హృదయం సిగ్గుపడుతుంది. కాని యంత్రం లాంటి చట్టం, యంత్రశక్తితో నడుస్తున్న స్టీమరు,ఆ ఆంగ్లేయ యువకుని శశిభూషణ్‌కు చిక్కకుండా చేశాయి.

రక్షించబడిన పల్లెకార్లను తీసుకొని శశిభూషణ్ స్వగ్రామానికి తిరిగొచ్చాడు. మునిగిపోయిన పడవలో జనప నార బేళ్ళున్నాయి. వాటిని తీయడానికి మనుష్యులను ఏర్పర చాడు. నష్టం రాబట్టుకోవడానికి స్టీమరు మేనేజరుమీద దావా వేయమని పల్లెకారులకు సలహా ఇచ్చాడు.

పల్లెకారులు ఎంతచెప్పినా అంగీకరించలేదు. మునిగిన పడవ ఎలాగూ మునగనే మునిగింది. పైగా మేముకూడా ఎక్కడ మునిగిపోము! దావావేయటం మాటలా! పోలీ సోళ్ళకు ఇంతో అంతో ముట్టచెప్పుకొనందే వాండ్లు కల్పించు కోరు. ఆ తర్వాత పనిపాటలు అన్నీ మానుకొని కూడూ నీళ్ళూ లేకుండా కోర్టులచుట్టూ తిరుగుతుండాలి. చివరకు అనేక చిక్కులకు లోనవుతాం. ఇంతకూ మనమే జయిస్తా మన్న నమ్మకమేమిటి? ఎందుకులే బాబు, మమ్మల్నిలా బ్రతకనీయండి; అన్నారు పల్లెకారులు. శశిభూషణ్ వకీలనీ, దావా కయ్యే ఖర్చులన్నీ స్వయంగా తానే భరిస్తాడనీ, నష్ట పరిహారంకూడా లభించవచ్చనీ తెలిసింది. పల్లెకారులు దావా వెయ్యడానికి అంగీకరించారు. కాని స్టీమర్లో ప్రయాణం చేసిన శశిభూషణ్ వూరివాండ్లు సాక్ష్యం చెప్ప డానికి అంగీకరించలేదు. బాబూ ! మేమేం చూడలేదండీ;

ఎక్కడో వెనక కూర్చున్నాం. కెరటాల చప్పుళ్ళు, ఇంజను రొదలో తుపాకి శబ్దం ఎక్కడ వినిపిస్తుందండీ! అన్నారు.

చివరకు స్వదేశీయుల పిరికితనాన్ని అసహ్యించుకొని తనే స్వయంగా కోర్టులో కేసు నడిపాడు శశిభూషణ్.

కోర్టులో సాక్షుల అవసరం రాలేదు. ఆ ఆంగ్లేయ యువకుడు తుపాకి కాల్చిన మాట నిజమేనని అంగీకరించాడు. కాని పడవమీద పేల్చలేదన్నాడు; "ఆకాశంలో ఎగురు తున్న కొంగలను గురిచూచి తుపాకి పేల్చాను. అప్పుడు స్టీమరు మలుపుతిరిగి నదిలో వేగంగా పోతోంది. అందువల్ల కొంగే చచ్చిందో లేక పడవే తలక్రిందులైందో తాను చూడ లేదని, భూమ్యాకాశాలలో షికారు చేయడానికి అనేక జీవజంతుజాలం వుండగా ఆ మురికి గుడ్డను పేల్చవలసిన అవసర మేమిటి?" అని సమాధానం ఇచ్చాడు ఆ ఆంగ్లేయ యువకుడు.

దొర నిర్దోషి అని తీర్మానించింది కోర్టు. దొర సిగరెట్టు పొగ వదుల్తూ కోర్టులోనుంచి సరాసరి క్లబ్బుకు వెళ్ళి పేకా టలో కూర్చున్నాడు. పడవ మునిగిపోయినప్పుడు లోపల వంటచేస్తున్న మనిషి శవం అచటికి అయిదు క్రోసుల దూరంలో ఒడ్డుపట్టింది. శశిభూషణ్ ఆవేదనతో ఇల్లు చేరుకున్నాడు.

శశిభూషణ్ ఊరికి తిరిగివచ్చిన రోజునే చక్కగా అలంకరించిన నావమీద గిరిబాలను అత్తవారింటికి తీసుకు వెళ్ళుతున్నారు. శశిబాబును ఎవరూ పిలువలేదు. అయినా

చూద్దామని నది ఒడ్డుకు వెళ్ళాడు. రేవునిండా జనం వున్నారు. అందువల్ల కొంచెం ఎగువకు పోయి నిలబడ్డాడు. నావ రేవును విడచి శశిభూషణ్ ముందరగా సాగిపోయింది. లోపల మేలిముసుగులో వున్న నవవధువు గిరిబాల ఒక్కసారి మెరుపువలె మెరసి మాయమయింది. అత్తవారింటికి వెళ్ళే లోగా ఎలాగైనా శశిభూషణ్‌తో ఒకసారి మాట్లాడవలెనని గిరిబాల చాలారోజులనుండి తహతహ పడుతోంది కాని తన గురువుగారు ఇవాళ ఆ సమీపంలోనే ఎక్కడో తనను చూస్తూ నిలబడ్డారని పాపం ఆమెకెలా తెలుస్తుంది! ఒక్కసారన్నా ముఖమెత్తి ఆమె బయటకు చూడలేదు. లోపల కూర్చుని ఎక్కెక్కి ఏడుస్తున్న ఆమె చెక్కిళ్ళవెంట కన్నీరు చారలుకట్టి ప్రవహిస్తోంది.

క్రమక్రమంగా దూరమయి అదృశ్యమయింది నావ ప్రాతఃకాల సూర్యకిరణాలకు నదీజలం తళతళ మెరుస్తోంది. ఆ సమీపంలో ఒకానొక మామిడి కొమ్మమీద కూర్చుని ఆలాపిస్తున్న కోకిల కువకువలు ఆత్మసంతృప్తిని కలిగించ లేదు. బల్లకట్టు రేవులో జనాన్ని అటు నిటు దాటేస్తోంది. నీలాటిరేవులో గుమిగూడిన అమ్మలక్కలు అత్తవారింటికి పోతున్న గిరిబాలను గురించి పెద్దగా ముచ్చటించుకుంటు న్నారు సులోచనాలు తీసి చెమ్మగిల్లిన నయనాలను తుడుచుకుంటూ ఇంటికి వెళ్లి బజారువైపు గదిలో బల్లమీద కూర్చొని దీర్ఘ నిట్టూర్పు విడిచాడు శశిభూషణ్. ఇంతలో 'శశి భయ్యా' అన్న గిరిబాల స్వరం వినిపించినట్లయిం దకస్మాత్తుగా. గిరీ! ఎక్కడమ్మా? ఏదీ ఎక్కడున్నావు? —

కాని గిరిబాల ఎక్కడా లేదు! ఆ పిలుపు ఆ ఇంట్లో కాదు. ఆ బజార్లో కాదు. ఆ వూరిలోనూ కాదు. మరెక్కడా కాదు. కన్నీటితో తడిసిన తన హృదయాంతర్భాగంలో నుంచి కాబోలు ఆ పిలుపు!!!

# 8

శశిభూషణ్ మూటా ముల్లె సర్దుకుని మళ్ళీ కలకత్తాకు ప్రయాణమయాడు. కలకత్తాలో పను లేమీ లేవు. అసలక్కడకు వెళ్ళడంలో ప్రత్యేకతా లేదు. కనుక రైలు మీద వెళ్ళకుండా నదీమార్గాన నావలో ప్రయాణం జేయడానికి నిర్ణయించుకొన్నాడు.

అవి వర్షాకాలపు రోజులు. వంగదేశపు వాగులు వంతలు అన్నీ వరదలతో నిండిపోయాయి. సస్యశ్యామలమైన వంగభూమి పచ్చని చెట్లు, లతలు, ఆకు, అలము, చెరకు మొదలైన పంటపొలాలు, నదులు, ఉపనదులు, సెలయేర్లతో ప్రకృతి సౌందర్యంతో వెల్లివిరుస్తున్న నవయువ్వన జవ్వనివలె కనుల పండువుగా వుంది.

సంకీర్ణమైన జలప్రవాహాన్ని చీల్చుకుంటూ శశిభూషణ్ నావ నదిలో ప్రయాణం చేస్తోంది. నిండువరు ప్రవాహం వడ్డులను వరుసుకొని పారుతోంది. అక్కడక్కడ, తుంగా, రెల్లు దుబ్బులు, వెదురుగుమ్ములు, మామిడితోపులు, వరిపొలాలు నీటిలో మునిగిపోయాయి. నేలంతా జలమయమయింది. అంతరిక్షాన వున్న ఆ దేవకన్యలు వచ్చి ప్రకృతి

సౌందర్య విలసితయగు వంగధరణిలోని తరులతాదులను నీటితో నింపి వేసినట్లున్నది.

యాత్రా ప్రారంభానికి ముందు స్వచ్ఛమైన సూర్య కిరణాలు ప్రకృతిని శోభాయమాన మొనర్చుతున్నాయి. ఇంతలో అకస్మాత్తుగా ఆకాశంలో కారుమేఘాలు అలము కొన్నాయి. వర్షంకూడా కురియ నారంభించింది. వర్షపు చినుకులకు నేలంతా బురదతో చిత్తడిగా తయారయింది. వర్షపు వెల్లువలకు సంకీర్ణమైన గోశాలలో నిలబడి పైనుండి పడుతున్న వర్షధారలకు తడుస్తూ మనవైపు కరుణాపూరిత దృక్కులతో చూస్తున్న గోమాతమాదిరిగానే ప్రకృతి సౌందర్యవిలసితమగు వంగమాత నిశ్శబ్ద వ్యధితహృదయంతో ఆ వర్షంలో తడుస్తూ దుఃఖిస్తోంది. తాటాకు గొడుగులు వేసుకొని రైతులు ఇటు నటు తిరుగుతున్నారు. రైతాంగనలు ఈదురుగాలికి వణుక్కుంటూ అవసరాలకు తడుస్తూనే ఇరుగింటికి, పొరుగింటికి పోయి వస్తున్నారు. స్త్రీలు జారు తున్న నీలాటిరేవులో అడుగులో అడుగేసుకుంటూ నీళ్ళు ముంచుకొని జాగ్రత్తగా నడుస్తున్నారు. పనిపాటలు లేని పురుషులు తాపీగా ఇండ్లలో అరుగులమీద కూర్చొని పూసులాడుకుంటూ చుట్టలు కాలుస్తున్నారు. ఇక తప్పని సరై అత్యవసరమైన పనులుంటే తప్ప ఇండ్లలోంచి ఎవరూ బయటకు రావడంలేదు

ఎంతకూ వాన వెలియక పోవడంతో శశిభూషణ్‌కు, నావప్రయాణం విసుగెత్తింది. అందుచేత ఆ ప్రయాణం విర మించుకొని రైలుమీద వెళ్ళడానికి నిర్ణయించుకొన్నాడు.

అది రెండునదులు కలిసేకూడలి ఇక నావకు అక్కడే లంగ రేయించి వంట ప్రయత్నాలు చేయిస్తున్నాడు శశిభూషణ్.

కుంటికాళ్ళెప్పుడూ గోతిలోనే పడుతుంటాయి. ఇది సహజం. అందులో దోషం కేవలం గోతిది కాదు; కుంటి కాళ్ళదికూడా. అన్నసామెతను శశిభూషణు డెదుర్కొన్న సమస్య రుజువు చేసింది.

రెండునదులు ఏకమయ్యే ఆ సంగమప్రదేశంలో జాల రులు ఇటు నటు నావలుపోవడానికి ఒకవైపు కొంచెం ఖాళీ వుంచి చేపలకోసం పెద్ద వల కట్టివుంచారు. చాలాకాలంనుంచి వారలాగే చేస్తున్నారు. అందుకు ప్రభుత్వానికి డబ్బుకూడా చెల్లిస్తున్నారు. దురదృష్టవశాత్తు ఆ సంవత్సరం పోలీసు సూపరింటెండెంటు ఆ త్రోవనే వెళ్ళుతున్నారు. వారి పడ వను దూరానచూచి, పల్లెకారులు ఆపడవవానితో వల వుంది జాగ్రత్తగా వెళ్ళమని ముందుగా హెచ్చరించారు. కాని సోదరమానవులు కల్పించిన అడ్డంకులను సహృదయంతో మన్నించి పడవను ప్రక్కకుమళ్ళించడం దొరగారి నావికు నకు అలవాటులేదు. పల్లెకారులు చెప్పిందంతా చెవిటివాని ముందు శంఖూదినట్లే అయింది పడవను వలమీదినుంచే పోనిచ్చాడు. పాపం; అక్కడికీపల్లెకారులు వలకిందికిదించారు. కాని చుక్కాని వలలో తగులుకోనే తగులుకుంది. ఎలాగో కొంచెంసేపటికి చుక్కాని బయటకువచ్చింది. కాని పోలీసు సూపరింటెండెంటు గారికి కోపం వచ్చింది. ఆ రౌద్రాకారుని చూడటంతోనే పల్లెకారులకు పై ప్రాణాలు పైనే పోయాయి. అక్కడనుంచి భయపడి పారిపోయారు. 'వలను కోసేయమని'

తన కలాసులకు ఆజ్ఞాపించాడు. వెంటనే ఏడెనిమిదివందల రూపాయల విలువగల వల నాశనమయిపోయింది.

అక్కడికీ దొర కోపం చల్లారలేదు. ఆ పల్లెకారులను పట్టుకరమ్మనమని సిఫాయిలను పురికించాడు. వారు కొంత దూరం పరుగెత్తారు. పల్లెకారులు చిక్కకపోయేసరికి త్రోవన పోతున్న ఎవరో నలుగురు నిరపరాధులను తీసుకొచ్చారు. పాపం; వాళ్లు అసలు ఏమీఎరుగరు. దొరగారితో నిరపరాధుల మని మొరపెట్టుకున్నారు. అయినా వినేదెవరు?

సూపరింటెండెంటు ఈ నిరపరాధుల్ని తమతో తీసుక రమ్మనమని ఆజ్ఞాపిస్తుండగా, శశిభూషణ్ వంటికి చొక్కా అన్నా తొడుక్కోకుండా ఆదరా బాదరా పరుగెత్తుకుంటూ అక్కడకువచ్చాడు. వణుకుతున్న కంఠంతో "సర్; ఈ పల్లె కారుల వల కోసివేయడానికి, నిరపరాధులను పట్టుకపోవడానికి మీ కెక్కడుంది అధికారం?" అన్నాడు.

పోలీసు సూపరింటెండెంటు కోపోద్రిక్తుడయాడు. శశి భూషణుని తూలనాడాడు. శశిభూషణ్ ఇది సహించలేక పోయాడు. అందాకా వడ్డుమీదే వుండి మాట్లాడుతున్న వాడల్లా ఈ మాటలు విని నావలోనికి దూకి సూపరింటెం డెంటును చావమోదాడు.

పోలీసులు శశిభూషణుణ్ణి అనేక చిత్రహింసలు పెట్టారు. దాంతో అతనికి స్పృహ తప్పింది. తిరిగి స్పృహ వచ్చి చూచుకొనేసరికి స్టేషనులో పడివున్నాడు. అప్పటి అతని స్థితినిగురించి చెప్పడానికి సంకోచించవలసి వస్తోంది.

ఆత్మాభిమానం కోల్పోయి శారీరక క్లేశములను అనుభ
వించాడు. అది వింటే మన శరీరంకూడా గగుర్పొడుస్తుంది.

## 9

వకీలునుపెట్టి శశిభూషణుణ్ణి, తండ్రి బెయిల్‌మీద
విడిపించుకొచ్చాడు. తదుపరి కేసుకు అవసరమైన ఏర్పాట్లు
చేశాడు.

వలను నష్టపోయిన పల్లెకారులుకూడా శశిభూషణ్
పరగణాకు చెందినవారే ఇంతకుముందు అప్పుడప్పుడు సల
హాలకోసరం శశిభూషణ్ దగ్గరకు వచ్చి పోతుండేవారు. చివ
రకు సూపరింటెండెంటు నిర్బంధించి తెచ్చిన ఆ నిరపరాధులు
కూడా శశిభూషణ్‌కు తెలిసినవారే.

వారందరినీ పిలిచి సాక్ష్యం చెప్పమని అడిగాడు.
ఆమాట విని వారు గాభరాపడ్డారు "పోలీసులతో తగువులు
తెచ్చుకొని ఇక ఈలోకంలో, బ్రతికి బట్ట కట్టగలమా
బాబూ! అది మావల్లగాదు. అయిందేదో అయింది. ఇక
ఇప్పుడు మళ్ళీ సాక్ష్యాలు, గీక్ష్యాలు చెప్పి మరోముప్పు
ఎవరు నెత్తికి రుద్దుకుంటారు!" అన్నారు శశిభూషణ్‌తో.

ఎంతగానో నచ్చజెప్పిన మీదట చివరకు జరిగింది
జరిగినట్లు యధార్థం చెపుతామని మాట ఇచ్చారు.

ఈలోగా ఒకసారి ఏదో పనిమీద హరకుమార్ జిల్లా
ధికారులవద్దకు వెళ్ళాడు. ఆసందర్భంలో పలుకరించి వద్దా

మని సూపరింటెండెంటు దొరగారిదగ్గరకుకూడా వెళ్ళాడు. అప్పుడు సూపరింటెండెంటు ఎకసక్కెంగా "హారకుమార్ గారూ, మీఇలాకాలో కొందరు పోలీసులకు వ్యతిరేకంగా తప్పుడుసాక్ష్యాలు పలకడానికి తయారయ్యారని విన్నాం; అది ఎంతవరకు నిజం?" అని అడిగాడు.

"ఏమిటేమిటి! పోలీసులకు వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పటమే. అంత సాహసంకూడా వుండి చచ్చిందీ ఆ జాతి తక్కువ గాడిదలకు" అన్నాడు హారకుమార్ వులిక్కి పడుతూ.

ఆ కేసులో శశిభూషణ్‌కు వ్యతిరేకమే జరిగింది. ఒక్కరూ అతనికి అనుకూలంగా సాక్ష్యం చెప్పలేదు. పల్లె కారులందరు కోర్టుకు వచ్చి 'పోలీసులు అసలు తమ వలను కోసేయలేదనీ, నావలోకి పిలచి తమపేర్లు అడిగి వ్రాసుకుని పంపించారని సాక్ష్యం చెప్పారు. అంతేకాదు. శశిభూషణ్ వూరివాండ్లు కూడా అయిదారుగురు 'తాము ఎక్కడికో పెండ్లికి వెళ్ళుతూ శశిభూషణ్ పోలీసులను అన్యాయంగా చావబాదటం తాము కండ్లారచూచామని' సాక్ష్యంచెప్పారు.

ఆస్థితిలో శశిభూషణునికి కోర్టు శిక్ష విధించితే అది అక్రమము కానేరదు. శశిభూషణ్ మీద దొమ్మీ, అక్రమ ప్రవేశం, పోలీసుల కర్తవ్య నిర్వహణకు అడ్డు తగలడం మొదలైన నేరాలు ఆరోపించబడ్డాయి.

శశిభూషణునికి అయిదు సంవత్సరముల శిక్ష విధించ బడింది. తనకు ప్రియాతిప్రియమైన పుస్తకాలను ఆ చిన్న

గదిలో వదిలేసి శిక్షను అనుభవించడానికి జైలుకు వెళ్ళాడు శశిభూషణ్. అప్పీలుకు ఏర్పాట్లు చేస్తున్న తండ్రిని శశి భూషణ్ వద్దని వారించాడు. "నాన్నా, ఈలోకంకన్న ఆ జైలే నయం, జైలు తలుపులకు వున్న ఇనుపవూచలు కనీసం అబద్ధమన్నా ఆడకుండా వుంటాయి. కాని జైలు వెలుపల మానవులకు లభించే స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు, తోటి మానవులనే మోసపుచ్చి ఆపదల్లో ఇరికిస్తాయి. జైలులో స్థలం పరిమితంగా వుంటుంది. అందువల్ల జైలులో మిథ్యావాదులు, పిరికిపందలు, కృతఘ్నులు చాల తక్కు వగా వుంటారు. ఇక ఈ స్వేచ్ఛా ప్రపంచంలో అనేక రకాల మనుష్యులు వుంటారు" అన్నాడు.

# 10

శశిభూషణ్ జైలుకు వెళ్ళిన కొద్దికాలానికి అతని తండ్రి మరణించాడు. ఇక అతనికి ఒక అన్నగారు తప్పితే ఇంకెవరూ లేరు. కాని ఆయన ఇక్కడ వుండడంలేదు. మధ్య ప్రదేశ్‌లో ఉద్యోగం చేస్తూ అక్కడే స్థిరనివాసం ఏర్పరచు కొన్నాడు. అడపా దడపా వచ్చి తమ్ముణ్ణి, తండ్రిని చూచి పోతుండేవాడు. ఇక వూరిలో శశిభూషణునికి వున్న ఆస్తి నంతా మాయోపాయాలతో హరకుమార్ కాజేసాడు.

శశిభూషణ్ జైలులో మిగతా ఖైదీలకంటే అధి కంగా బాధలు అనుభవించాడు. చివరకు అయిదేండ్లు పూర్తయి శిక్షాకాలం ముగిసింది.

అది వర్షాకాలం. ఒకరోజున జైలునుంచి విడుదలైన శశిభూషణ్ కృశించిన శరీరం, విదీర్ణ హృదయంతో జైలు బయటకువచ్చి నిలబడ్డాడు. జైలు బయట స్వేచ్ఛమాత్రం లభించింది. అంతకంటే విశేషం ఏమీ కనిపించలేదు. గృహ విహీనుడు, బంధు మిత్ర సంఘ పరిత్యాగికి ఈ ప్రపంచంలో ఏమి కనిపిస్తుంది? శశిభూషణ్ ఇప్పుడు ఏకాకి. అతనికి ఈ విశాల ప్రపంచమంతా మృగతృష్ణలా కనిపించింది.

జీవితమాలలో తెగిపోయిన దారాన్ని తిరిగి ఎక్కడ ముడిపెడదామా అని ఆలోచించుకుంటుండగా ఒక గుర్రపు బండి వచ్చి శశిభూషణ్ ముందర నిలబడింది. నౌకరు దిగి "శశిభూషణ్ బాబుగారంటే తమరేనా?" అని అడిగాడు.

"అవును; నేనే."

బండి తలుపులు తెరచి శశిభూషణ్ బాబును లోనికి ఎక్కమన్నట్లుగా నిరీక్షిస్తూ నిలబడ్డాడు నౌకరు.

శశిభూషణుకు ఆశ్చర్యం కలిగింది. "ఎక్కడికి?" అని అడిగాడు.

తమరిని తీసుకరమ్మనమని మా అమ్మగారు పంపించింది.

ఆ త్రోవన వచ్చిపోయేవారు అతనిని అత్యంత కుతూహలంగా చూస్తున్నారు. అది శశిభూషణునికి అసహ్యమనిపించింది. ప్రశ్నలు అడుగుతూ ఆలస్యంచేయడం అనవసరమనుకున్నాడు వెంటనే గుర్రపుబండి ఎక్కి కూర్చున్నాడు. బండి కదలి వెళ్లిపోయింది. శశిభూషణ్ ఇందులో ఏదో పొర

పాటు జరిగివుంటుం దనుకొన్నాడు. కాని చివరకు ఎక్కడికో ఒకచోటికి చేరుకోక తప్పదుగదా! ఏమో, పొరపాట్లతోనే మళ్ళీ తన నూతన జీవితాధ్యాయం ప్రారంభం కావలసివుం దేమో! అని అనుకున్నాడు.

ఆనాడుకూడా మేఘాలు, ఎండలు ఆకాశంలో దాగుడుమూతలు ఆడుతున్నాయి పచ్చని వరిచేలు వర్షపు వరదల వెల్లువలో మునిగివున్నాయి. త్రోవ కిరువైపులావున్న ఆ పొలాలమీాద చంచలమగు మబ్బుతెరలు, ఎండపొడల ఛాయలు పడినప్పుడు ఆ దృశ్యం నయనానందం కలిగిస్తోంది. ప్రకృతి సౌందర్యాన్ని తిలకిస్తూ బండిలో ప్రయాణం చేస్తున్న శశిభూషణ్ హృదయంలో గతానుభూతులు, భవిష్యజ్జీవితపు టాలోచనలు, బండిచక్రాలలాగా దొర్లుకొస్తున్నాయి. వాటిని పాటల్లో కూర్చుకొని తనలో తానే ఏదో గానం చేస్తున్నాడు.

వృద్యానవనంలోగల ఒక విశాలమైన భవనం ముందరకు వెళ్ళి ఆగింది బండి. బండి నిలచిపోవడం తోనే శశి భూషణ్ ఆలోచనలకు అంతరాయం కలిగింది. అత నెవర్నీ ప్రశ్నించకుండా నౌకరును అనుసరిస్తూ సరాసరి ఇంట్లోకి వెళ్ళి కూర్చున్నాడు.

అతను వెళ్ళి కూర్చున్న గదిలో అద్దాల బీగువాల నిండా పుస్తకాలు చక్కగా అలంకరించబడి వున్నాయి. వాటిని చూడగానే తిరిగి తన పూర్వపు పుస్తక ప్రపంచం గుర్తుకొచ్చింది. జైలు జీవితాన్ని మరచిపోయాడు. రంగు

రంగుల బైండ్లతో అలరారుతున్న ఆ పుస్తక సమూహం, సుపరిచిత స్నేహానురాగాలను వర్షిస్తూ తనను మళ్ళీ ఆనంద సామ్రాజ్యంలో ప్రవేశింపమని ఆహ్వానిస్తున్న దివ్య భవనపు సింహద్వారంలా విలసిల్లుతోంది.

ఎదురుగా వున్న టేబిల్ మీాదకూడా ఏవో వస్తువులున్నాయి. దృష్టిమాంద్యుడయిన శశిభూషణ్ వాటిని జాగ్రత్తగా పరిశీలించాడు. వాటిలో పగిలిపోయినపలక, సిరా మరకలు పడి నల్లగా వున్న కాపీ పుస్తకం, చిరిగిపోయిన ఎక్కాలపుస్తకం, కథామాల, మహాభారతం కనిపించాయి. పలక బందులమీాద పెద్దపెద్ద అక్షరాలతో "గిరిబాలాదేవి" అని తన స్వదస్తూరీ కనిపించింది. కాపీలు మొదలైన పుస్తకాలమీాదకూడా అదేపేరు, తన దస్తూరితోనే వుంది.

శశిభూషణ్‌కు తానెక్కడికి వచ్చిందీ అర్థమయింది. అతని హృదయాంతరాళంలో ఆందోళనాతరంగాలు చిందులేశాయి. కిటికీలోంచి బయటకు చూశాడు. అతనికి కనిపించిందల్లా, తనవూరు తనుకూర్చునేగది, బయటబజారు, డోరియా పరికిణీ కట్టుకున్న గిరిబాల. శాంతియుతమయిన పూర్వపు ఆ ఏకాంత జీవిత స్మృతులు తిరిగి శశిభూషణ్ స్మృతిపథంలో మెరుపులాగా మెరిశాయి.

ఆరోజుల్లో అతను ప్రశాంత జీవితం గడిపాడు. చిన్న చిన్న పనులతో రోజులు సుఖంగా గడచిపోయేవి. అతనికి తన నిత్య కార్యక్రమంలో ఆ చిన్నారి విద్యార్థినికి చదువు చెప్పడం అతిసామాన్య సంఘటన. ఆ ఏకాంతవాస గ్రామీణ జీవితం, ఆ ప్రశాంతత, అందాలు చిందిస్తూ ఆనందంతో మైమరపించే గిరిబాల ముఖాకృతి మొదలైన శత

స్మృతులు స్వర్గసుఖాలు కల్పింపజేసి అతనిని అకాంక్షల రాజ్యంలో కల్పనాలోకంలో విహరింప జేశాయి. ఆరోజుల చిత్రాలు, స్మృతులు వర్షాకాలపు ప్రకృతిలో మృదుమధుర మైన సంగీతాలాపన గావించుతున్నాయి. చుట్టూ అడవి, బురదతో నిండిన ఆ గ్రామపు వీధిలో నిలబడిన ఆ బాలిక లోని గంభీర స్వభావం, వేదనాభరితమైన కారుణ్యం, అతనిలో పూర్వానుభూతులను జాగృత మొనర్చాయి. శశి భూషణుడు ఆ పలక, పుస్తకములమీాద తన దృష్టి నిగిడ్చి చాలరోజుల తదుపరి మళ్ళీ ఈనాడు గడచిన మధురాను భూతులను గుర్తుకు తెచ్చుకుంటున్నాడు

అతను అలా చాలాసేపు గడిపాడు. ఆ తర్వాత మృదుమధురస్వరం విని మేల్కొని శశిభూషణ్ ముఖమెత్తి చూచాడు. వెండిపళ్లెములో పాలు, పంచదార మొదలైన ఫలహారాలు తీసుకొచ్చి గిరిబాల బల్లదగ్గర నిశ్శబ్దంగా నిల బడి వుంది. ధవళవస్త్రధారిణి, నిరాభరణ అయిన గిరిబాల అవనతవదనయై శశిభూషణునికి నమస్కరించింది.

శుష్కవదనంతో శిథిలశరీరుడైన శశిభూష ణుణ్ణి చూడగానే గిరిబాల నేత్రద్వయంలో కరుణ పెల్లుబి కింది. చెక్కిళ్ళ వెంట కన్నీరు జలజలా కారింది.

శశిభూషణుడు కుశల ప్రశ్నలు అడుగుదా మను కున్నాడు. కాని అతనికి భాష దొరకటంలేదు. హృదయాంత రాళంనుండి పొర్లుకొస్తున్న దుఃఖం వాక్యములను బయటకు రానీయకుండా అడ్డుపడుతోంది. వాక్యములు, అశ్రువులు రెండూ హృదయంలోనుంచి కంఠందాకా వచ్చి అక్కడే ఆగిపోతున్నాయి.



# పరాజితులు

ప్రొద్దు గ్రుంకవచ్చింది. ఇంతలో ఎక్కడనుంచో అకస్మాత్తుగా విరుచుకుపడింది పెనుతుఫాన్. దేవా సురుల మధ్య భయంకర యుద్ధాగ్ని ప్రజ్వరిల్లిందా అన్నట్లు హోరు గాలి, జడివాన, ఉరుములు మెరుపులతో ఆకాశమంతా అల్ల కల్లోలంగావుంది. మహాప్రళయవిజయసంకేతంలా కొండ ల్లాంటి నల్లని కారుమేఘాలు అటు నిటు ఉవ్వెత్తున లేస్తు న్నాయి. ఇటు నటు లేస్తున్న వుత్తుంగనదీతరంగాలు హోరు గాలికి లయ తప్పకుండా గంగానదిలో నృత్యం చేస్తున్నాయి.

చందన నగరంలో ఒకతోట. ఆ తోటమధ్యలో ఒక ఇల్లు. ఇంటి తలుపులు, కిటికీలు అన్నీ మూయబడివున్నాయి. లోపల దీపం తేజోవంతంగా వెలుగుతోంది. వసారావైపు గదిలో భార్యాభర్త ఇద్దరూ మంచంమీద కూర్చొని ఏదో విషయంమీద తర్జన భర్జన పడుతున్నారు.

శరత్: "ఇంకా కొన్నాళ్ళపాటు ఇక్కడేవుండి ఒంట్లో పూర్తి స్వస్థత చిక్కాక ఇంటికి వెళ్ళటం మంచిది."

కిరణ్మయి: "నాకు పూర్తి స్వస్థత చిక్కింది. ఇక ఇప్పుడు నిశ్చింతగా ఇంటికి వెళ్ళిపోవచ్చు".

వివాహితులకు ఈ విషయం ఇంతక్లుప్తంగా ముగియ లేదని చెప్పనవసరం లేదు. వారు మాట్లాడుకుంటున్న విషయం కూడా అంతప్రధానమైంది కాకపోయినా వాద ప్రతివాదాలు జోరుగానే చెలరేగుతున్నాయి. కాని పర్యవసానం మాత్రం ఎవరూ ఏమీ తేలనీయడంలేదు. నావికుడులేని నావలాగా వారి వాదోపవాదాలు ముందుకు సాగిపోకుండా ఒకేచోట స్థంభించిపోయాయి. చివరకు అలిగి కంట తడిపెట్టేవరకూ వెళ్ళాయి పరిస్థితులు.

శరత్ : "ఇంకా కొన్నాళ్ళపాటు డాక్టరు ఇక్కడే వుండమంటున్నాడు."

కిరణ్మయి : "మీ డాక్టరుకు ముందేమిజరిగేది కూడా తెలుసనుకుంటా!"

శరత్ : "ఈరోజుల్లో దేశంలో రోజుకు రోజు క్రొత్త క్రొత్త జబ్బులు వ్యాపిస్తున్నాయన్న సంగతి నీకూ తెలుసు. కాబట్టి ఇంకా రెండుమూ సాలపాటు ఇక్కడే వుండిపోదాం."

కిరణ్మయి : "అయితే ఇక్కడ ఇప్పుడిక ఎవరినీ ఏ జబ్బూ ఆశించదు కాబోలు."

నాటి వారి ఆసంభాషణ అంతటితో ఆగిపోయింది. ఇరుగు పొరుగు అమ్మలక్కలు, చివరకు అత్తగారుకూడా కిరణ్మయిని ఎంతో ఆప్యాయతగా చూస్తున్నారు కిరణ్మయి మంచాన పడటంతో ఇంటిల్లిపాదీ విచారసాగరంలో మునిగి పోయారు. గాలిమార్పు జరిగి రోగికి సంపూర్ణ విశ్రాంతి లభి స్తేనేకాని ఈ రోగం నయంకాదని చెప్పేశాడు డాక్టరు.

డాక్టరు సలహాకు ఎవరూ అభ్యంతరం చెప్పలేదు. ఇల్లు వాకిలి, పొలం బాల్రా వదిలేసి కిరణ్మయి ఆరోగ్యం కోసం పరాయిచోటుకు వెళ్ళడానికి నిశ్చయించుకొన్నారు. ఇది విని ఇదంతా నవనాగరీకులు చేసే తెలివితక్కువ పని అని భావించారు గ్రామస్తులు. అంతేకాదు, ఏం? ఊళ్ళో ఇంతకు ముందు పెద్దజబ్బులేమీరాలేదా? అందరూ ఇలా ఇల్లు వాకిళ్ళు వదలి పరాయిచోట్లకే పోయి జబ్బులు నయం చేయించుకొచ్చారా? శరత్ వెళ్ళాలనుకుంటున్న ఆ వూళ్లో మాత్రం అందరూ దేవతలా-అమరులవటానికి; ఇంతకీ గీత ఎలావుంటే అలాజరిగి తీరుతుంది. దాన్ని మార్చటం ఎవ్వరి తరం? ఇలా అనేకమైన వ్యంగ్యపరిహాసాలతో వారిని అవహేళన చేయసాగారు. కాని తల్లికొడుకులు ఇద్దరూ వాటిని అసలు పట్టించుకోనే పట్టించుకోలేదు. గ్రామీణుల ఆ పరిహాసాలకంటె వారికి కిరణ్మయి ప్రాణాలు దక్కించుకోవడమే ముఖ్యమనిపించింది. ఆప్తులకు సంభవించిన ఆపదలకు మానవ హృదయాలు అలానే ఆరాట పడతాయి.

చందన నగరంలో శరత్ ఒక తోటలో వుంటున్నాడు. కిరణ్మయి రోగం కూడా తిరుగుముఖం పట్టింది; కాని ఇంకా బలహీనత పోయి ఒంట్లో పూర్వపు జవసత్తువలు రాలేదు. బాగా బక్క చిక్కిపోయిన ఆమె నేత్రాలలో ఒకరకమైన కరుణాపూరిత దుర్బలత వ్యక్తమవుతోంది. ఆ మూర్తిని చూచీ చూడటంతోనే "అయ్యో! ఎంతపని జరిగింది. నిజంగా మళ్ళీ పునర్జన్మెత్తావమ్మా!" అని అంటాం అప్రయత్నంగా వణకుతున్న హృదయంలోంచి.

కిరణ్మయి కలుపుగోరుమనిషి. ఆమెకు చుట్టూ ఎప్పుడూ పదిమంది స్నేహితురాండ్రు వుండాలి. అలా అయితేనే గాని ఆటలు పాటలు వినోదాలతో ఆమెకు ప్రొద్దుపోదు. జవసత్త్వలు నశించి ఎముకలగూడుగా తయారైన ఆమె ఒంటరితనాన్ని సహించలేకపోతోంది. గంటగంటకు సీసాల్లోని మందులు సేవించటం, కాపులు కాచుకోవడం, పథ్యాలు చేసిచేసి ఆమె మనస్సు విసుగెత్తి పోయింది. ఇవాళ సాయంత్రం తుఫాన్ ప్రారంభించి నప్పటినుండి ఈ విషయం మీదే తర్జన భర్జన పడుతున్నారు.

కిరణ్మయి జవాబు లిస్తున్నంతసేపు ఎవరికి ఎవరూ తీసిపోలేదు. ఇద్దరిమధ్య సమానంగా వాగ్యుద్ధం జరుగుతూనే వుంది. కాని చివరకు ప్రతివాదం చేయటంమానేసి తలవంచుకుని కిరణ్మయి అలిగి కూర్చున్నది. అది చూచి శరత్ ఇక గత్యంతరం లేక ఆమె కోర్కెను మన్నించటానికి సిద్ధపడుతుండగా ఇంతలో వెలుపలనుంచి నౌకరు పిలిచాడు.

తలుపులు తెరచి సంగతేమిటని అడిగాడు శరత్. "గంగానదిలో ఎవరిదో నావ మునిగిపోయింది. ఒక బ్రాహ్మణ బాలుడు ఈదుకొని మనతోటలోనికి వచ్చాడు" అనిచెప్పాడు నౌకరు.

అమాట వినగానే కిరణ్మయిలో జాలి పెల్లుబికింది. వెంటనే ఇంట్లోకి పోయి పొడిబట్టలు తెచ్చియిచ్చింది. త్వర త్వరగా పాలు వేడిచేసి బ్రాహ్మణబాలుని లోనికి పిలుచుకపోయింది.

కోలముఖం, విశాలమైన నుదురు, పొడవాటి వెంట్రు కలతో పిల్లవాడు చూపులకు అందంగానే వున్నాడు. మూతి మీద నూనూగు మీసాలు ఇంకా మొలకెత్తలేదు. ఆ పిల్ల వానికి స్వయంగా తన చేత్తో భోజనం వడ్డించింది. భోజనం చేసి లేచాక వాని పరిచయం అడిగింది.

తాను నాటక కంపెనీలో పనిచేస్తున్నానని, ఈ చుట్టుప్రక్కల ఒకానొక భాగ్యవంతుడు తమవూళ్ళో నాటకం ఆడించడానికి పిలిపిస్తే వస్తుండగా నదిలో నావ తలక్రిందులై మునిగి పోయిందని, ఒకరిజాడ ఇంకొకరికి తెలియకుండా 'ఎవ రికి వారే యమునాతీరే' అయిపోయామని, బాగా ఈతరావటం చేత ఈది తాను ఒడ్డు పట్టగలిగానని, పేరు నీలకాంతుడని తన పరిచయం చెప్పుకున్నాడు బ్రాహ్మణబాలుడు.

మృత్యుముఖంనుండి బ్రతికి బయట బడిన ఆ బాలుని మీద కిరణ్మయికి అపరిమితమైన దయకలిగింది. అతన్ని తన వద్దనే వుండిపొమ్మన్నది. అందువల్ల ఆ బాలు డక్కడే వుండిపోయాడు.

ఇక ఈ విధంగా అయినా కొన్నాళ్ళపాటు 'పద పద' అని కిరణ్మయి పోరుపెట్టకుండా వుంటుందన్నఅభిప్రాయంతో ఇదీ ఒకందుకు మంచికే వచ్చిం దనుకున్నాడు శరత్. బ్రాహ్మణ బాలుని చేరదీసి ఆశ్రయమిస్తే పుణ్యం చేకూరు తుందన్న నమ్మకంవల్ల సంతోషంతో మెదలకుండా వూరు కుంది అత్తగారుకూడా. కర్కశుడైన నాటక కంపెనీ మేనే జరు, యమధర్మరాజు మృత్యుపాశంనుండి విముక్తుడై తల

వని తలంపుగా ఈ ధనిక పరివారంలో వచ్చిపడినందుకు ఆనందంతో వుప్పొంగి పోయాడు నీలకాంతుడు.

కాని తల్లీ కొడుకుల అభిప్రాయాలు చాలా తొందర గానే మారిపోసాగాయి. కిరణ్మయికూడా పూర్ణ ఆరోగ్య వంతురాలైంది. ఇక ఈ పిల్లవాడిని ఎలాగోలాగు వదిలించు కొనవలెనని ఆలోచించుకున్నారు వారిద్దరూ.

శరత్ ఇంట్లో లేనప్పుడు నీలకాంతుడు వాని హుక్కా గొట్టాన్ని నోట్లోపెట్టుకొని చాటుమాటుగా గుడుగుడు పీల్చ డం ప్రారంభించాడు. శరత్ బాబు ఇంట్లో మంచి సిల్కుగొడు గొకటుంది. జోరున వర్షం కురుస్తున్నా లెక్కచెయ్యకుండా బాబుగారి ఆ గొడుగువేసుకొని నీలకాంతుడు కొత్తమిత్రుల కోసం వూళ్లో చెక్కర్లుకొట్టివస్తుంటాడు. ఎక్కడనుంచో మురికి కుక్క నొకదాన్ని పట్టుకొచ్చాడు. అది వానికి బాగా మాలి మైంది. రానురాను ఆ మాలిమికారణంగా, అది సరాసరి చక్కగా అలంకరించబడిన శరత్ బాబుగదిలో ప్రవేశించి, మంచంమీాద పరచిన మల్లెపువ్వులాంటి తెల్లని దుప్పటిపైన పడుకోసాగింది. గదంతా మురికిచేసి ధూళిధూసరితమైన పాదపల్లవాల పదచిహ్నాలను తన శుభాగమన సూచకంగా అది దానిమీాద వదలి వెళ్ళుతుంటుంది. చూస్తూచూస్తూ వుండగానే నీలకాంతుడు వూళ్ళోని బాలురందర్నీ ఆకర్షించి తన శిష్యబృందంలోనికి చేర్చేసుకున్నాడు. ఇక ఆ సంవ త్సరం ఊరిలోని మామిడితోటల్లో పచ్చిమామిడికాయలు పండే పనేలేకుండాపోయింది.

కిరణ్మయికి ఆ పిల్లవానిమీద అపరిమితమైన ప్రేమ. వానిని విడచి క్షణం వుండలేకపోతోంది తల్లీ కొడుకు లిద్దరూ ఎంతగానో చెప్పి చూశారు. కాని లాభంలేకపోయింది కిరణ్మయి తన భర్త చొక్కాలు, పంచెలు, తలపాగా, మేజోళ్ళూ, బూట్లతో ఆ బాలుణ్ణి హుందాగా ముస్తాబుచేసి 'బజారుకు పంపిస్తుండేది. అప్పుడప్పుడు దగ్గరకు పిలచి కూర్చో బెట్టుకొని తియ్యటి కబుర్లు చెప్పించుకొని ఆనందం పొందు తుండేది. స్నానం, భోజనాలు పూర్తిచేసుకొని, కిరణ్మయి మంచంమీద తాంబూలం నములుతూ కూర్చుంటుంది. దాసీది వచ్చి తడిసిన వెంట్రుకలను ఆరబెట్టి చిక్కు తీస్తుంది. ఇక నీలకాంతుడు ఆమె కెదురుగా నిలబడి ఆంగికాభినయా లతో నల-దమయంతి నాటకంలోని హంసదౌత్య సన్నివే శాన్ని భావయుక్తంగా ప్రదర్శించి ఆనందింపజేస్తాడు. ఈ విధంగా కిరణ్మయికి రోజూ మధ్యాహ్నంపూట కులాసాగా గడచిపోతోంది. నీలకాంతుని అభినయాన్ని చూచి ఆనం దించమని కిరణ్మయి శరత్‌ను బలవంతం చేసేది. కాని నీల కాంతునిమీద శరత్‌కు కోపం. అందువల్ల ఆ అభినయాన్ని తిలకించటానికి శరత్ చీదరించుకునేవాడు. అతని ఎదుట నృత్యం చేయడానికి నీలకాంతుడుకూడా సంకోచించేవాడు. ఖర్మంకాలి నిజంగా శరత్ ఎదుట నృత్యంచేయవలసివస్తే ఆ నృత్యంలో ఆరోజు అసలు జీవకళే వుండేదికాదు. దేవతల మీద వున్న భక్తితో ఒక్కొక్కనాడు అత్తగారుకూడావచ్చి ప్రేక్షకులలో కూర్చునేది. కాని మిట్టమధ్యాహ్నపు నిద్రా దేవత తాకిడికి ఆ భక్తికాస్తా ఆమడదూరం పారిపోయేది.

ఇక ఆమె మంచంమీద మేనువాల్చి గురకలుతీసి నిద్ర పోయేది.

నీలకాంతుడు అప్పుడప్పుడు శరత్ చేత దెబ్బలు, చివాట్లు తింటుండేవాడు. కాని, ఇంతకంటె కఠిన శాసనానికి మొదటినుండీ అలవాటుపడివుండడంవల్ల అతనికి ఈ అవమానాలు, చివాట్లు, దెబ్బలు ఒక లెక్కలోనివిగా కనిపించేవికావు; ప్రపంచంలో జలము, పృథ్వీ విభజింపబడిన మాదిరిగానే మానవ జీవితంకూడా ఆహార విహారాలు, చివాట్లు, దెబ్బలుగా విభజింపబడిందని దానిలో చివాట్లు, దెబ్బల అంశమే ఎక్కువనీ నీలకాంతుడు నమ్ముతుండేవాడు.

నీలకాంతునికి వయస్సెంతవుంటుందో సరిగా వూహించడంకష్టం. పదునాలుగు, పదిహేనేళ్లు వుంటాయి అనుకుంటానికి వయస్సుకుమించిన మాటలు మాట్లాడుతున్నాడు. పదిహేడో, పదునెనిమిదో వుంటాయి అనుకుంటానికి చూపులకు అంతవయస్సు కనిపించటంలేదు.

అసలతడు చిన్నతనంలోనే నాటకాల కంపెనీలోచేరి రాధ, దమయంతి, సీత, సత్యభామల సరసన సఖిపాత్ర ధరిస్తుండేవాడు. ఆ మండలి అతనిని అంతవరకే వుపయోగించుకొన్నది. అందువల్ల ఇంకా అభివృద్ధికి పోకుండా అక్కడే ఆగిపోయాడు. కంపెనీలో అందరూ అతన్ని చిన్నచూపే చూసేవారు. నీలకాంతుడుకూడా తానంతవరకే పనికొస్తానేమోనని అనుకున్నాడు కాని అతనిఎడ వయస్సుకుదగ్గ గౌరవము చూపబడలేదు. ఇలాంటి కొన్ని స్వాభావిక, అస్వాభావిక కారణాలవల్ల పదిహేడు, పదునెనిమిదేండ్ల వానినిగా

భావించినప్పుడు వయస్సుకు తగ్గ తెలివి తేటలు లేనివాడుగను, పదునాలుగు, పదిహేనేండ్లవానినిగా భావించినప్పుడు వయస్సుకు మించిన తెలివితేటలు గలవాడుగాను కనిపిస్తాడు. అదీ అసలుసంగతి. ముఖ్యంగా మూతిమీద నూనూగుమీసాలు ఇంకా మొలకెత్తకపోవటంతో ఈ భ్రమ మరీదృఢమవుతోంది. పొగాకు ధూమం పారినందువల్ల కానీయండి లేక వయస్సుకు తగ్గ మాటలు మాట్లాడుతున్నందువల్లనే కావచ్చు వాని పెదవులచుట్టుపట్ల యవ్వనచిహ్నాలు కొంచెం అధికంగానే కనిపించుతున్నాయి కాని విశాలమైన వాని ఆ నల్లని నేత్రాంచలాల్లో ద్యోతకమవుతున్న ఆ తరుణ సరళ స్వభావాన్నిబట్టి ఆంతరంగికంగా అత నింకా బాగా పరిపక్వ స్థితికి రాలేదని, నాటకాల కంపెనీలో చేరిన కారణంగా బాహ్యదృష్టికిమాత్రం పరిపక్వం జెందినవాడుగా కనిపించుతున్నాడని భావించటం అసహజం కాదు.

ఇంతవరకు తనను ఆవరించుకొని వున్న కొన్ని అస్వాభావిక పరిస్థితులవల్ల నీలకాంతుడు వయస్సుతోపాటు అభివృద్ధి జెందలేకపోయాడు. కాని చందననగరోద్యాన వనంలో శరత్ బాబు ఆశ్రయం లభించాక నీలకాంతునిలోని ఆ అస్వాభావికత నశించి వానిలో స్వతస్సిద్ధమైన సహజత్వం క్రమక్రమంగా వికసించసాగింది. పదిహేడు, పదునెనిమిది సంవత్సరాల వయస్సుకు తగ్గ సహజ స్వభావాలు వానిలో స్పష్టాతిస్పష్టంగా ప్రస్ఫుటిత మవుతున్నాయి.

వానిలోని ఈ మార్పు చెందిన యవ్వన చిహ్నాలు బయటకు ఎవ్వరికీ కనిపించటంలేదు. కాని కిరణ్మయి చిన్న

పిల్లలతో ఆడినట్లుగా అతనితో ఆడుతున్నప్పుడు మొట్ట మొదట వానిలో ఆ పరిణామం కన్పించసాగింది ఆమె ప్రవర్తన కాతను లోలోనే సిగ్గుతో బాధపడుతుండేవాడు. ఒకనాడు వినోద ప్రియ కిరణ్మయి నీలకాంతుని స్త్రీ పాత్ర ధరించి సఖిగా అభినయించమని కోరింది. ఆమె కోరిన ఆ కోరిక అతనిని అమితంగా బాధించింది. తనలో జనించిన ఆ పరిణామానికి గల కారణాలు అతనికి అర్థం కావడంలేదు. ఇప్పుడిక ఎప్పుడన్నా నాటకాభినయం చూపించమని కోరిన నాడు అసలు కంటికి కనిపించకుండా ఎక్కడికో పారిపోయే వాడు. తను ఆ నాటక కంపెనీలో మామూలు బాలుడుగా మాత్రమే పరిగణింపబడినందుకు ఇప్పుడు వాని హృదయం బాధపడుతోంది.

గుమాస్తాదగ్గర నీలకాంతుడు నాలుగు అక్షరాలు నేర్చుకుందామని సంకల్పించాడు. కాని కిరణ్మయికి స్నేహ పాత్రుడైనందున అతనిమీద గుమాస్తాకు ఈర్ష్యగా ఉండేది. దానికితోడు ఏకాగ్రతఅనేది అసలు నీలకాంతుని మనస్తత్వా నికే పూర్తిగా విరుద్ధం. మరి అలాంటప్పుడు ఆ అక్షరపు ముక్కలు ఎలా అబ్బుతాయి ? నదిలో ఒకదాని వెనుక ఒకటి పరుచుక పడుతున్న అలల కెరటాలు, ఇటు నటూ పోతున్న నావలు, వృక్షజాలముమీద కూర్చొని వివిధ పక్షి జాలం చేస్తున్న కలకలారవాలు విని తన్మయుడై నీలకాంతుడు మామిడి మ్రానుకు మేను వాల్చి గంగానది ఒడ్డున కూర్చునే వాడు. గురువులేని స్వవిద్య అతని కసంభవమేయయినా పుస్తకం చేతిలోవుంటేనేగాని అతనికి సంతృప్తివుండేదిగాదు.

తన ముందరగా ఏదన్నా నావ పోతుంటే చూచి నిజంగాచదువు తున్నవాడిలా ఆడంబరం చూపుతూ పెదవులు కదల్చుతుం డేవాడు. కాని ఆనావ అలా కా స్త ముందుకుసాగిపోవడంతోటే ఆ ఆడంబరపు చదువుకూడా అంతటితో ఆగిపోయేది.

పాడమనగానే తన నోటికి వచ్చిన పాటలను వెనుకా ముందు ఆలోచించకుండా, నీలకాంతుడు పాడుతుండేవా డిది వరలో. ఇప్పు డా పాటల్లోని స్వరాలు వాని హృదయాంత రాళంలో అవ్యక్త అపూర్వ చాంచల్యాన్ని కల్గిస్తున్నాయి. ఆరోజుల్లో ముఖ్యంగా నల–దమయంతి నాటకంలోని సాధా రణ శబ్దాలు అనుప్రాసలతో కూర్చిన పాటనొకదాన్ని తర చుగా పాడుతుండేవాడు. ఆపాట అతనికి పూర్తిగా అర్థమవు తుందాఅంటే అదీ లేదు. కాని ఆ మర్మవేదనంతా స్వయంగా తానే అనుభవిస్తున్నట్లు, ఆ పాట పాడేటప్పుడు అందులో పూర్తిగా తన్మయత్వం జెందేవాడు. నల–దమయంతి నాటకం లోని రాజహంస రాజకుమారీల గాన సంభాషణలు వాని హృదయంలో ఏవేవో అపూర్వచిత్రాలను చిత్రించేవి. అప్పుడు తన్నుగూర్చి తా నేమనుకొనేవాడో స్పష్టంగా నిర్వ చించలేము. కాని ఆ కాసేపు నాటకకంపెనీలో తా నొక సాధారణ బాలకుడన్న విషయాన్ని పూర్తిగా మరచిపోయే వాడు. సాయంత్రం తల్లిఒడిలో పడుకొని అమ్మచెపుతున్న కథలు విని ప్రశాంతంగా నిద్రిస్తూ నిద్రలో ఏడేడు సముద్రాలు దాటిపోయి, బంగారు రాకుమారి, ఏడుగురు రాజకుమారుల ధనసంపదలను చూచినట్లు కలగని ఆనందంతో పుప్పొంగి పోయే అతిదరిద్రులింట జన్మించిన అభాగ్యబాలునిలాగే

నీలకాంతుడుకూడా "ఓ రాజహంస! నిష్ఠురవై విలయం సృష్టిస్తావెందుకు" అన్న పాటను పాడుతున్నప్పుడు పూర్ణ తన్మయత్వంజెంది పులకాంకితు డయేవాడు. ఇంతలో బజారు నుండి వచ్చిన శరత్ బాబు ఇరుగు పొరుగులవాండ్ల చాడీలకు నీలకాంతుని లాగి ఒక్క చెంపపెట్టు పెట్టేవాడు తనను ఆనంద డోలికలలో వూగులాడిస్తున్న ఆగీతికామరీచికలు మరి అప్పు డెక్కడ మాయమయేవో.

కాలేజీకి శెలవలు ఇచ్చారు. ఇక శరత్ కడగొట్టు తమ్ముడు సతీశ్ కూడా చందననగరం వచ్చాడు. అతని రాకకు కిరణ్మయి ఎంతో సంబరపడింది. పగలు ప్రొద్దస్త మానం మరిదిని విడిచిపెట్టకుండా వానితో ఆటపాటలు, హాస పరిహాసాలాడుతూ కాలక్షేపంచేస్తోంది. ఒకప్పుడు ఇంత కుంకుమ చేతినిండా పోసుకొచ్చి వాని ముఖానికి పులిమి ఏడ్పించేది. ఇంకొకప్పుడు అతని చొక్కా వెనుక కోతి అని వ్రాసి అక్కడ పెట్టేది. దా న్నతడు చూడకుండా తొడు క్కొని బజారుకు పోతుంటే వెనుకనుంచి ఫక్కుననవ్వి ఎగ తాళిచేసేది. అప్పుడప్పుడు సతీశ్ ను లోపలపెట్టి గదితలుపు లకు గొళ్లెం బిగించి వెళ్లిపోతుండేది. సతీశ్ కూడా తక్కువ వాడేంకాదు. ఆమెకన్నా రెండాకు లెక్కువే చదివాడు. అతనుకూడా ఆమె తాళపుచెవుల్ని దొంగిలించటం, కిళ్ళీ లలో పచ్చిమిరపకాయ ముక్కలుపెట్టి ఇవ్వడం. వెనగ్గావచ్చి పమిటచెంగును మంచం కోటికి ముడేయటం, ఇలా ప్రతీకా రాలు చేసి ఏడ్పిస్తుండేవాడు. ఈ విధంగా వదినా-మరదులు పగలు ప్రొద్దస్తమానం అల్లరిచిల్లరి చేష్టలు, సరసాలతో

ప్రొద్దుపుచ్చేవారు. ఆ ఆటపాటల్లో అసలు సూర్యాస్తమయం అయేదికూడా వారికి తెలిసేదికాదు.

మరి ఎందువల్లనో? నీలకాంతుని ఆనందం రోజుకు రోజు దిగజారిపోతోంది. ఇప్పుడిక ఏ వంకమీద ఎవరితో లడాయి వేసుకోవాలో అతనికి తోచటంలేదు. వాని హృదయం విచార సాగరంలో మునిగిపోయింది. వెర్రిమొర్రి చేష్టలకు దిగాడు. తన స్నేహితుల్ని నిష్కారణంగా ఏడిపిస్తున్నాడు. ఎంతో ప్రేమతో పెంచిన ఆ దేశవాళి కుక్కను వీపు వాయకొట్టున్నాడు. అంతటితో ఆగలేదు వాని ఆ వికారపు చేష్టలు. దోవన పోయే బాటసారులమీద కూడా అప్పుడప్పుడు చేయి చేసుకుంటున్నాడు.

బాగా తినగలిగిన వాండ్లను ఎదురుగా కూర్చోబెట్టుకొని తనివితీరా తినిపించడమంటే కిరణ్మయికి బహుసర్దా. ఆశక్తి నీలకాంతుని కుంది. తీపిపదార్థాలు, ఎన్నిసార్లు తెచ్చి వడ్డించినా వద్దనకుండా అన్నీ తినేస్తాడు. అందువల్ల తరచుగా కిరణ్మయి వానిని లోనికి పిలచి తానే వడ్డించి దగ్గర కూర్చుని తినిపిస్తుండేది. తనివితీరా తిని తృప్తిజెందిన బ్రాహ్మణ బాలుని చూచి ఆమె ఎంతో సంతోషించేది. కాని సతీశ్ వచ్చినప్పటినుండి నీలకాంతునికి తనచేత్తో వడ్డించే తీరిక వుండటంలేదు కిరణ్మయికి. ఇదివరలో అప్పుడప్పుడు ఇతరులు భోజనం వడ్డించినా అతనికి బాధ కలిగేదికాదు. చీమంత కూడా మిగల్చకుండా శుభ్రంగా భోజనం చేయడం అతనికి అలవాటు. కాని ఇప్పుడు అతనికి భోజనం రుచించడంలేదు. వడ్డించిన పదార్థాలు ముట్టకుండానే 'నా కాకలిగా లేదు,

అంటూ రుద్ధకంఠంతో పలికి లేచిపోతున్నాడు. ఈ విషయం కిరణ్మయికి తెలిస్తే తనను లోనికి పిలిపించి అన్నం వడ్డించి తినమని బ్రతిమాలుతుందని, అప్పుడు తాను అలిగి కూర్చుని 'నా కసలే ఆకలి లేదని' చెప్పాలని అతని వుద్దేశ్యం. కాని ఆ ఇంట్లో కిరణ్మయితో ఆ విషయం చెప్పేవారే లేరు. మరి కిరణ్మయికూడా అతన్ని గురించి అజా పజా కనుక్కోవటం లేదు. చివరకు రానురాను కుండ అడుగున కాస్తో కూస్తో అన్నం మిగిలితే నీలకాంతునికి పెట్టకుండా దాన్ని కాస్తా ఇంట్లో పనిచేసే దాసీలు తీసుకపోయేవారు. అప్పు డిక నీలకాంతుడు తనగదిలోకి వెళ్ళి దీపం ఆర్పేసి మంచంమీద పడుకొని ఎక్కెక్కి ఏడుస్తుండేవాడు. ఆ చీకట్లో అతను ఎందు కలా ఏడుస్తున్నాడో? ఏమి కావాలో? అడిగి తెలుసుకొని ఓదార్చవలసిన అవసరం ఎవరి కేముంది? ఎవరూ రాకపోతే చివర కిక స్నేహామయి అయిన విశ్వధాత్రి ఆ నిద్రా దేవతే వచ్చి తన కోమల కరస్పర్శతో నెమ్మది నెమ్మదిగా జోకొట్టి ఆ మాతృవిహీన వ్యథిత బాలకుని అశాంత హృదయాన్ని వూరట పరచి బుజ్జగించి నిద్ర పుచ్చుతుంది.

నీలకాంతునికి తనమీాద సతీశ్ కిరణ్మయి కేవో చాడీలు చెప్పుతున్నా డన్న భావం ఏర్పడింది. కారణాంతరాల వల్ల కిరణ్మయి ఎప్పుడన్నా గంభీరంగా కాస్త ముఖం మాడ్చుకుందంటే సరి; ఇక ఆనాడు సతీశ్ తనమీద ఏవో చాడీలు చెప్పాడని, అందుచేతనే ఆమె తనను పల్కరించటం లేదని నీలకాంతుడు భావించేవాడు.

వచ్చేజన్మలో తనను సతీశ్‌గాను, సతీశ్‌ను నీలకాంతునిగాను పుట్టించమని నీలకాంతుడు భగవంతుని ప్రార్థించ సాగాడు. ఏకాగ్రచిత్తంతో పెట్టిన బ్రాహ్మణ శాపం ఎన్నడూ వృథాపోదని అతని విశ్వాసం. అందువల్ల సతీశ్‌ను భస్మం చేసేద్దామన్న ఈర్ష్యతో లోలోన అతడే కుమిలి కుమిలి భస్మమై పోతున్నాడు. మేడమీా నుంచి వదినా మర దుల సరసాలు, పకపకలు, వికవికలు క్రిందికి వినిపిస్తున్నాయి.

కత్తికట్టి సతీశ్‌కెదురు నిలబడేధైర్యం నీలకాంతునిలో లేదు. అప్పుడప్పుడు రేవుఒడ్డున సబ్బుబిళ్ళపెట్టి సతీశ్ గంగా నదిలో మునిగి స్నానం చేస్తుండేవాడు. నీలకాంతుడు చాటు మాటుగా వచ్చి సబ్బు తీసుకొని కనిపించకుండా పారిపోయే వాడు. సతీశ్ పైకివచ్చి సబ్బుకోసం వెదికితే అది అక్కడ కనిపించేదికాదు. ఒకనాడు కొత్తగా కుట్టించుకున్న సిల్కు చొక్కా విడిచి ఒడ్డున పెట్టి సతీశ్ నదిలో స్నానంచేస్తు న్నాడు. ఒకటి రెండు మునకలు మునిగి లేచి చూసేసరికి ఆ చొక్కా కాస్త గంగానదీ ప్రవాహంలో కొట్టుకొని పోతోంది. గాలికి ఎగిరి నదిలో పడిందేమో అనుకున్నాడు కాని ఆగాలి ఏదిక్కుగా వచ్చిందో తెలియుటలేదు అవ కాశం లభించినప్పుడు ఇలా సతీశ్‌ను అవమానపరచి నీలకాం తుడు ఆత్మసంతృప్తిని పొందుతుండేవాడు.

ఒకనాడు సతీశ్‌ను సంతోషపెట్టటానికి నీలకాంతుని పిలిచి నాటకంలోని పాటలు పాడమన్నది కిరణ్మయి. కాని నీలకాంతుడు సమాధానం చెప్పకుండా అలానే నిలుచు న్నాడు. ఏమైంది? ఎందుకు పాడవు? అని అడిగింది ఆశ్చ

ర్యంగా కిరణ్మయి. అప్పటికికూడా నీలకాంతుడు నోరెత్త లేదు. 'ఆ రాజహంస' పాట ఒకసారిపాడుదూ! అని అడిగింది కిరణ్మయి మళ్ళీ. "మరచిపోయాను" అని చెప్పి నీలకాంతుడు అక్కడనుండి వెళ్ళిపోయాడు.

చివరకొకనాడు చందననగరం మకాం ఎత్తేసి వూరికి పోవటానికి సన్నాహాలు చేస్తున్నారు. సతీశ్ కూడా వెళ్ళుతున్నాడు. కాని నీలకాంత్ ను ఎవరూ నీవుకూడా మాతో వస్తావా అని అడగలేదు సరిగదా చివరకు తాము వెళ్లిపోతున్న కబురుకూడా చెప్పలేదు. నీలూకూడా వచ్చేస్తాడా లేక ఇక్కడే వుండిపోతాడా అన్న ప్రశ్నే వుదయించలేదు ఎవరి మనస్సులోను.

నీలూనుకూడా వెంటతీసుక వస్తానన్నది కిరణ్మయి. కాని భర్త, అత్త, మరది ఎవ్వరూ అందు కంగీకరించలేదు. చివరకు కిరణ్మయికూడా తన అభిప్రాయాన్ని మార్చుకుంది. వెళ్లిపోబోయేముందు నీలూని పిలచి బుజ్జగించి తలిదండ్రుల వద్దకు పొమ్మని బ్రతిమాలింది.

చాలకాలం తర్వాత ఇవ్వాళ మళ్ళీ కిరణ్మయి నోటి నుండి వెలువడ్డ ఆ మధురవాక్యాలు విని దుఃఖము ఆపుకోలేక నీలకాంతుడు వెక్కెక్కి ఏడ్వసాగాడు. కిరణ్మయి నేత్రద్వయంకూడా అశ్రుజలంతో నిండిపోయింది. జీవితపర్యంతం తన వద్ద వుంచుకోకుండా మూనాళ్ళ ముచ్చటకు దగ్గరకుతీసి ప్రేమతో మమకారం కలిగించి ఒక అమాయక పసి హృదయాన్ని ఇలా గాయపరచినందుకు కిరణ్మయి హృదయంలో ఆరని పశ్చాత్తాపజ్వాలలు చెలరేగుతున్నాయి.

అప్పుడు సతీశ్ కూడా ప్రక్కనే నిలబడివున్నాడు. అన్నేళ్ళొచ్చిన నీలకాంతుడు చిన్న పిల్లవానిలా వలవల విలపిస్తున్నందుకు సతీశ్‌కు కోపం వచ్చింది. "అరే, ఇదేం పనిరా! ఒకమాటా లేదు, మంతీ లేదు. బడుద్ధాయిలా ఎక్కెక్కి ఏడుస్తున్నావు" అని అన్నాడు సతీశ్.

ఆ మాటలకు సతీశ్‌ను మందలించింది కిరణ్మయి. "నీకు తెలియదు వదినా! నువ్వు అందర్నీ పూరకే నమ్మేస్తావు. వీ డెవడో, ఎక్కడనుంచొచ్చాడో, మంచి చెడ్డ లేమిటో ఎవరికీ ఏమీ తెలియదు. ఇక్కడకు వచ్చి రాజభోగాలు వెలిగిస్తున్నాడు పాపం! ఏంచేస్తాడు; నేటితో మళ్ళీ ఆ వెధవ జీవితం చవిచూడవలసి వచ్చింది. అందువలన ఎక్కెక్కి ఏడుస్తూ నిన్ను వంచింప చూస్తున్నాడు. కన్నీళ్ళుచూడటంతోటే నీ హృదయం కరిగిపోతుంది. అదే నీలోని బలహీనత; అందుకే వాడలా ఏడుస్తున్నాడు" అన్నాడు సతీశ్.

సతీశ్ అన్నమాటలు విని నీలకాంతుడు అక్కడనుంచి వెళ్ళిపోయాడు. కాని నీలకాంతుని హృదయంలో సతీశ్ మీద కోపజ్వాలలు రేకెత్తుతున్నాయి. తన హృదయ ఫలకంలో చిత్రించుకున్న సతీశ్ కాల్పనిక మూర్తిని కత్తులతో చీరికలు చీరికలుగా చీలుస్తున్నాడు. అగ్నియై దగ్ధం చేసేస్తున్నాడు సూదై ఒళ్ళంతా తెగపొడిచి వదిలి పెడుతున్నాడు. కాని నిజానికి వాటిలో ఏ ఒక్కటీ సతీశ్ వంటిని తాకటం లేదు. కాని నీలకాంతుని హృదయం వేదనాగ్ని జ్వాలలతో భగభగ మండిపోతోంది.

కలకత్తానుండి వచ్చేటప్పుడు సతీశ్ అందమైన కలమ్‌దాన్ తీసుకొచ్చాడు. దాని కిరువైపులా ముత్తెపు చిప్పలతో చేసిన రెండునావలు, ఆ నావలమీద సిరాబుడ్లు, మధ్యలో జర్మన్ సిల్వరుతో పోతపోసిన రెక్కలు చాచిన హంస, దానిముక్కులో కలం అమర్చి వున్నది. దానిని సతీశ్ ప్రాణప్రదంగా చూచుకుంటున్నాడు. జేబులోని పట్టు రుమాలుతో దాని దుమ్ము దులుపుతుండేవాడు. కిరణ్మయి ఆ హంసముక్కు మీద చిటికేసి పరిహాసానికి "ఓ రాజ హంస! నిష్ఠురవై విలయం సృష్టిస్తావెందుకు" అనిఅంటుండేది తరచుగా. ఇకదానితో వదినా మరదుల మధ్య హాస పరిహాసాలు చెలరేగేవి.

ఊరికి వెళ్ళేముందురోజున ఆ కలమ్‌దాన్ కనిపించ కుండా మాయమైంది. "మరదిగారు, తమ రాజహంస దమయంతీదేవిగారిని అన్వేషించటానికి ఎగిరి పోయినట్లుందే!" అని అన్నది కిరణ్మయి పరిహాసంగా నవ్వుతూ.

కిరణ్మయి చేసిన పరిహాసానికి సతీశ్ మండిపడ్డాడు. నీలకాంతుడే ఆకలమ్‌దాన్ దొంగిలించాడని అతనికి గట్టి నమ్మకం. దానికితోడు నిన్న సాయంత్రం నీలకాంతుడు సతీశ్ గది పరిసరాలల్లో అదేపనిగా తారట్లాడుతూ తిరిగినట్లు ఆధారాలుకూడా వున్నాయి.

అపరాధిని సతీశ్ ముందు హాజరుపరచారు. కిరణ్మయి కూడా దగ్గరేవుంది. "నీవు ఆ కలమ్‌దాన్ దొంగిలించి ఎక్కడ దాచావు? ఊ, తెచ్చివ్వు త్వరగా;" అని సతీశ్ నీల కాంతుని గద్దించాడు.

తెలియక చేసిన అపరాధాలకు ఇంతకుముందు చాలా సార్లు నీలకాంతుడు శరత్ చేతిలో చివాట్లు, దెబ్బలు తిన్నాడు. ఆనాడు వాటిని అత్యంత ప్రశాంతంగా సహించగలిగాడు. కాని కిరణ్మయిఎదుట తనమీద కలమ్‌దాన్ దొంగిలించబడిన నేరం ఆపాదించటంతో వాని క్రోధారుణనేత్రాలలో తీవ్ర కోప జ్వాలలు చెలరేగాయి. హృదయం పగిలిపోతోంది. ఒంట్లో వేడిరక్తం సలసల మసలుతూ పొంగులువారుతోంది. ఆ పరిస్థితుల్లో ఇక సతీశ్ నోటినుండి తనకు వ్యతిరేకంగా ఒక్కమాట వెలువడినా ఆకలిగొన్న సింహంలాగ మీదికి లంఘించి మింగివేయుడానికి నీలకాంతు డుద్యుక్తుడయాడు.

వానిని ప్రక్కగదిలోనికి తీసుకవెళ్ళి మృదుమధుర స్వరంతో బుజ్జగిస్తూ "నీలూ; ఒకవేళ నీ వా కలమ్‌దాన్ తీసి వుంటే రెండోకంటికి తెలియకుండా నా చేతికి తెచ్చివ్వు నిన్నెవరూ ఏమీ అనకుండా చూసేబాధ్యత నాది" అని అడిగింది కిరణ్మయి బ్రతిమాలుతూ.

నీలకాంతుని నేత్రద్వయంలోంచి అశ్రుజలం జలజల ప్రవహించసాగింది; చివరకు అర చేతుల్లో ముఖాన్ని దాచుకొని వలవల ఏడ్వసాగాడు.

గదినుండి వెలుపలికివచ్చి "నీలూ ఈ దొంగతనంలో అసలు ఏపాపం ఎరుగడు" అన్నది కిరణ్మయి.

అన్నదమ్ములిద్దరు ఒకరొకరు సమర్థించుకొంటూ "తప్పకుండా వాడే కాజేసివుంటాడు. వాడుతప్ప ఇక్కడ కాజేయటానికి ఇంకెవరున్నారు!" అన్నారు.

"దండించితే వాడంతట వాడే చెప్పకేం చేస్తాడు" అన్నాడు శరత్.

"వాడిమీద ఎవరూ చేయిచేసుకోటానికి వీలులేదు" అని పట్టుపట్టింది కిరణ్మయి.

"కనీసం గదిని, ట్రంకుపెట్టెను అన్నా సోదాచూదాం" అన్నాడు సతీశ్.

"నీవు సోదాచేయటానికి వీలులేదు, అలా చేశావంటే ఇక జీవితాంతం నీతో నేను మాట్లాడను అన్నెం పున్నెం ఎరుగని ఆ నీలకాంతుని నీ వలా అనుమానించటమే పొర పాటు" అన్నది కిరణ్మయి.

ఈ మాటలు అంటున్నప్పుడు ఆమె కనుకొలకుల్లో కన్నీళ్ళు క్రమ్మాయి. ఇక ఆమె కన్నీళ్ళకు భయపడి నీల కాంతుని ఎవరూ ఏమీ అనలేక పోయారు. నిరాశ్రితుడైన నీలకాంతుని మీద జరుగుతున్న ఆ అత్యాచారాలకు కిర ణ్మయి హృదయంలో దయాసాగర ముప్పొంగింది.

ఆ సాయంత్రం విలువైన జతపంచెలు, జతచొక్కాలు, జతచొక్కాలు, చెప్పులు, ఒక పదిరూపాయలనోటు తీసు కొని కిరణ్మయి నీలకాంతుని గదిలో ప్రవేశించింది.

కిరణ్మయి తమస్నేహానికి జ్ఞాపక చిహ్నంగా వెళ్ళి పోబోయే ముందు ఆ వస్తువు లన్నింటిని నీలూకు తెలియ కుండా అతని ట్రంకులోపెట్టి వద్దామనుకుంది. ఆ ట్రంకును కూడా లోగడ ఆమే ఇచ్చింది.

పమిట కొంగున వున్న తాళపు చేతుల గుత్తిలోని ఒక మారు తాళపు చెవితో ట్రంకును తెరచింది. కాని ట్రంకు నిండా ఏవేవో వస్తువులు సందులేకుండా పెట్టివున్నాయి. అందుచేత తాను బహుమతిగా తెచ్చిన ఆ వస్తువులు అందులో పెట్టటానికి వీలులేకపోయింది. ఆ పెట్టెలో గాలిపటం, దారం, గోడెంబిళ్ళ, గుడ్డబొమ్మలు, బంతులు, పచ్చి మామిడి పిందెలను కోసుకు తింటానికి చాకు, పగిలిపోయిన గాజుగ్లాసు మొదలైనవి ఇంకా ఏవేవో వున్నాయి. వాటిల్లో ఒక్కటీ పనికొచ్చేది లేదు.

ట్రంకులోవున్న వస్తువులన్నింటిని జాగ్రత్తగా సర్దితే అన్నీ అందులోనే పడతాయి అని అనుకుని ఆ ట్రంకులోనుంచి వస్తువులన్నింటిని ఒక్కొక్కదాన్నే బయటకుతీయసాగింది కిరణ్మయి. ముందు గాలిపట , దాని సామానులు, ఆటవస్తువులు ఆ తర్వాత గుడ్డలు అన్నీతీసి బయటపడవేసింది. అన్నీ తీయగానే ట్రంకు అడుగున సతీశ్ కలమ్‌దాన్ కనిపించింది.

దానిని చూడటంతోనే కిరణ్మయి నిశ్చేష్టురాలైంది. కొంతసేపటివరకు దా న్నలాగే చేతిలో పట్టుకొని ఏమేమో ఆలోచిస్తూ నిలబడిపోయింది.

ఇంతలో ఎక్కడనుంచో వచ్చి నీలకాంతుడు ఆమె వెనుక నిలబడ్డాడు. అది అసలు ఆమె గమనించనే లేదు. ఆ దృశ్యాన్నిచూచిన నీలకాంతుడు తన దొంగతనం పట్టుకోవడానికి కిరణ్మయి స్వయంగా దొంగలాగా తనగదిలో ప్రవేశించి ట్రంకు సోదా చేస్తోంది అని భావించాడు. చివరకు తన దొంగతనంకూడా బయటపడిపోయింది. దాంతో గాభరా

పడ్డాడు. తాను ఈ దొంగతనం చేయాలని చేసిందికాదనీ, కేవలం సతీశ్ మీద పగతీర్చుకోవడానికి మాత్రమే ఈపని చేశాననీ ఆమె కెలా తెలియజెప్పాలో? నీలకాంతుని కేమీ బోధపడలేదు. రెండోకంటబడకుండా చాటుగా తీసుకుపోయి దాన్ని గంగానదిలో పారేద్దామని అనుకున్నాడు పాపం కాని వీలుచిక్కకపోవటం వల్ల ఆ తొందర్లో దానిని ఆ ట్రంకు అడుగున దాచేశాడు. ఈ సంగతులన్నీ ఆమెకు తెలియజేసి తాను నిర్దోషినని నిరూపించుకోవటం ఎలా? అవును, తాను అపరాధినికాకపోతే మరేమిటి? తాను అపరాధం చేసినమాట నిజమే! అందువల్లనే కిరణ్మయి తనను అపరాధిగా అనుమానిస్తుంది. ఆమె అనుమానం నిరాధారమైందని తేటతెల్లం చేయడం ఎలా? పోనీ, తెలియజేయకుండా వుందామూఅంటే ఆమె తన జీవితాంతం ఈ మర్మవేదనను అనుభవిస్తూ వుండాల్సిందేగా? అని ఇలా పరిపరి విధాల క్షోభతో వాని హృదయం అతల కుతల మవుతోంది. నీలకాంతుడు హృదయావేదనతో తపించిపోతున్నాడు.

కిరణ్మయి ఒక వేడి నిట్టూర్పు విడిచింది. కలమ్‌దాన్ ట్రంకు అడుగున పెట్టేసింది. ఎప్పటిలాగానే ఆ వస్తువు లన్నింటిని ఎక్కడి వక్కడ సర్ది తను తెచ్చిన బహుమానాలు, పది రూపాయలనోటు అందులోవుంచి ట్రంకు మూసేసింది. మళ్ళీ దాన్ని యథాస్థానంలో వుంచింది.

కాని తెల్లవారేసరికి ఆ బ్రాహ్మణబాలుడు అక్కడ నుండి తప్పించుకొని కనపడకుండా మాయమయాడు. ఎవరిని

అడిగినా అందరూ తమకు కనిపించలేదంటే తమకు కనిపించలేదన్నారు. పోలీసులుకూడా వాని జాడ తీయలేకపోయారు.

"ఇప్పు డిక వాడి ట్రంకు తెరచి చూద్దాం" అన్నాడు శరత్.

కిరణ్మయి మొండిపట్టుదలతో అలా జరగటానికి వీలు లేదు అని శాసించింది. అక్కడనుంచి ట్రంకును తన గదిలోనికి తీసుకపోయింది. తన గది తలుపులు, కిటికీలు అన్నీ మూసేసింది. ట్రంకులోని కలమ్‌దానును వెలికి తీసి రెండో కంటికి కనిపించకుండా వెళ్ళి దాన్ని గంగానదిలో పారేసి వచ్చింది.

శరత్ బాబు సపరివారంగా తన వూరు చేరుకున్నాడు. తోటంతటా నిశ్శబ్దత ఆవరించింది. శ్రీకాంతుడు పెంచిన ఆ కుక్కమాత్రం అన్నపానీయాలువిసర్జించి దుఃఖంతో విలపిస్తూ గంగానదీ తీరంలో అటూ ఇటూ తిరుగుతోంది. వ్యాకులతతో అది ఎవరికోసమలా అటుమటించి పోతుందో!!



# కట్నం

అయిదుగురు మగపిల్లల తర్వాత జన్మించిన ఆ ఏకైక పుత్రికకు తలిదండ్రులు 'నిరుపమ' అని పేరు పెట్టుకున్నారు. ఇంతకు పూర్వం గణపతి, శివయ్య, సీతమ్మ మొదలైన దేవుళ్ళ పేర్లు తప్ప ఇంతచక్కని ముద్దుపేరు ఆ ఇంటిలో విని పించనేలేదు.

నిరుపమకు యుక్తవయస్సు వచ్చింది ఆమెకు తగిన వరుణ్ణి తీసుకరావడానికి సుందరరామయ్య కాళ్ళకు బలపాలు కట్టుకొని తిరిగాడు. చివరకు ధనవంతుల వంశానికి చెందిన ఒక రావుబహద్దర్ గారి సంబంధం కుదుర్చుకొచ్చాడు. రావు బహద్దర్ గారికి తాత ముత్తవలు సంపాయించి ఇచ్చిపోయిన ఆస్తిపాస్తులు, మడిమాన్యాలు అన్నీ ఈపాటికే చాలావరకు హారతికర్పూరంలా హరించిపోయాయి. మరి ఇంగువ కట్టిన గుడ్డకు వాస నెక్కడికిపోతుంది? ఆయనగారిది ఇంకా ఘరానా కుటుంబమే.

వరుని తరఫు పెద్దలు పదివేల రూపాయలు కట్నం కోరారు. అది ఆయన తాహతుకు మించినదే అయినా ఈ

సంబంధాన్ని చేజారిపోనీయకూడదనుకొని సుందరరామయ్య వా రడిగినంత కట్నం ఇవ్వడానికి అంగీకరించాడు.

కట్నం డబ్బుకోసం సుందరరామయ్య పడరాని పాట్లన్నీ పడ్డాడు. ఇంట్లోవున్న వస్తువుల్లో కొన్నింటిని తెగ నమ్మాడు. మరికొన్నింటిని తాకట్టుపెట్టాడు. అక్కడికీ ఇంకా ఆరేడువేలు తక్కువే అయ్యాయి. ఇక లగ్నంకూడా ఆట్టే రోజులు లేదు.

చివర కారోజుకూడా వచ్చేసింది. పెచ్చువడ్డీ ఇస్తే మిగతాపైకం సర్దుతానని ఒక పెద్దమనిషి మాట ఇచ్చాడు. కాని తీరా లగ్నసమయానికి ఆ పెద్దమనిషి ముఖం తప్పించాడు. కట్నం అంతా అక్కడ పెట్టకపోయేసరికి కళ్యాణ మండపంలో కలకలం పుట్టి గగ్గోలు చెలరేగింది. సుందర రామయ్య రావుబహద్దరు రెండుచేతులు పట్టుకొని "బావా! ముందు శుభకార్యం కాస్తా పూర్తవనివ్వు; మీపైకం మీకు చిల్లిగవ్వతోసహా ముట్టజెప్పే పూచీ నాది" అని దీనాతి దీనంగా బ్రతిమాలుకున్నాడు.

"రూపాయలు అక్కడ పోస్తేనేగాని పిల్ల మెళ్ళో తాళి కట్టటం జరగదు" అన్నాడు రావుబహద్దర్.

ఇక ఈ దుర్ఘటన కారణంగా లోపల ఇంట్లో ఆడ వాళ్ళలో ఏడుపులు, మొత్తుకోళ్ళు ప్రారంభమయ్యాయి. అసలీ ముప్పునకంతా కారకురాలైన నిరుపమ, క్రొత్తచీరలు, నగలు ధరించి, నుదుట తిలకం దిద్దుకొని పెళ్ళి బట్టల్తో మౌనంగా ఒక మూలన కూర్చుంది.

అంతలో పరిస్థితులన్నీ తారుమా రయాయి. "కట్నాలు గిట్నాలు, డబ్బు దస్కం, లావాదేవీలు నా కేమీ తెలియవు. నేను ఇక్కడకు వచ్చింది పెండ్లిచేసు కుంటానికి; కాబట్టి పెండ్లికాందే ఇంటికి రాను" అని తెగేసి చెప్పాడు తండ్రితో పెండ్లికుమారుడు

పాపం; కుమారుణ్ణి ఏమీ అనలేక వూరుకున్నాడు రావు బహద్దర్. ఆనందోత్సాహాలతో జరుగవలసిన వివాహం ఎలాగై తేనేం చివరకు శోకంతో కూడిన నిరుత్సాహ వాతా వరణంలో జరిగింది.

అంపకాలప్పుడు సుందరరామయ్య హృదయంలోంచి పెల్లుబికి వస్తున్న కన్నీటిని ఆపుకోలేకపోయాడు. నిరుపమ తండ్రి కారుస్తున్న కన్నీటిని చూచి "అక్కడివాళ్ళు మళ్ళీ నన్నిక్కడకు తిరిగి పంపించరా నాన్నా?" అని అడిగింది. "ఎందుకు పంపించరమ్మా; నేను వచ్చి నిన్ను తీసుకువస్తే సరిగా" అన్నాడు సుందరరామయ్య.

సుందరరామయ్య కూతుర్ని చూచిపోవడానికి తర చుగా వియ్యాలవారింటికి వచ్చిపోతుండేవాడు. కాని అతనికి వియ్యాలవారింటిలో తగు గౌరవ మర్యాదలు లభించేవి కావు. వియ్యంకుడు, వియ్యపురాలు సగౌరవంగా చూడక పోతేపోయారు. చివరకు ఇంట్లో చాకిరీచేసే నౌకర్లకుకూడా సుందరరామయ్య లోకువయిపోయాడు. ముందుగా వియ్యం [illegible]డు, వియ్యపురాలు అనుమతి తీసుకొని - కేవలం అందు [illegible]రకై అంతఃపురానికి వెలుపల ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన [illegible]దిలో - కూతుర్ని కలుసుకొని మాట్లాడి ఇంటికి తిరిగి

వస్తుండేవాడు. అదైనా నాలుగైదు నిముషాలకంటె ఎక్కువ లభించేది కాదు. ఒకొక్కప్పుడు ఆమాత్రం అవకాశం కూడా చిక్కక సుందరరామయ్య కూతుర్ని చూడకుండానే తిరిగి వచ్చేవాడు.

సుందరరామయ్య వియ్యాలవారింట్లో తనకు జరుగుతున్న అవమానాన్ని సహించలేకపోయాడు. ఏమైనాసరే వాళ్ళ డబ్బు వాళ్ళ మొఖాన పారవేయటానికి నిర్ణయించుకున్నాడు.

ఇప్పటికే అంతులేని ఋణబాధల్లో వున్నాడు. రోజూ ఇల్లు గడవడమే కనాకష్టంగా వుంది. మరల ఇప్పుడు చెయ్యబోయే అప్పునుగురించి ఇక వేరే చెప్పేదేముంది. అప్పులవాళ్లు ఎదురుపడ్డప్పుడు సుందరరామయ్య కనుపించకుండా ముఖం తప్పిస్తున్నాడు.

అక్కడ అత్తగారింట్లో నిరుపమ యమయాతనలు పడుతోంది. అత్తమామలు తన తలిదండ్రులను నిందించే దూషణలు ఆమె వినలేక పోతోంది. తనకోసం ఏర్పాటు చేసిన గదిలో ఒంటరిగా కూర్చుని నిరుపమ లోలోననే దుఃఖంతో కుమిలిపోయేది.

అత్త మరీ ఎద్దేవ చేసింది చేసినట్లే ఉంటుంది. ఆమె నోరు ఊరుకోమన్నా వూరుకోదు. ఎవరైనా ఇరుగమ్మ, పొరుగమ్మలు వచ్చి "ఏమమ్మా నీ అదృష్టం! నీ కోడలు అచ్చం బంగారుబొమ్మ! ఏదీ, ఎక్కడ వుంది? కొద్దిగా చూపిద్దూ" అన్నప్పుడు హేళనగా "అవు నవును; ఆ అమ్మ అయ్య కన్నబిడ్డకాదూ! తలిదండ్రుల బుద్ధులనుబట్టే బిడ్డల

బుద్ధులుకూడా వుంటాయి. వాండ్లు వట్టి నీచులు" అని తిట్టి పోసేది అత్త.

ఆ ఇంట్లో అసలు నిరుపమ యోగక్షేమాలు విచారించే దిక్కే లేదు. ఎవరైనా జాలిపడి "నిరుపమ ఇవాళ భోంచేయలేదు. ఆమె నట్లా ఇబ్బంది పెడతారెందుకు?" అని అడిగితే సరి "చాలు చాల్లే; మహా చెప్పొచ్చారు. ఆమె గారి కిక్కడ రాణీగారికి జరిగినట్లు జరపడానికి వాళ్ళబ్బ దాచ బెట్టిన మూటేమీ లేదు." అని సమాధానం చెప్పేది అత్త

ఆ మాటలకు అర్థం ఏమిటి? వారికి ఇవ్వవలసిన కట్నం డబ్బు అణాపైసలతోసహా ముట్టజెప్పిందాక అత్తమామలు నిరుపమను గౌరవాదరణలతో చూడరన్న మాటేగా! నిరుపమ ఏదో మోసంజేసి ఆ ఇంటి కోడలుగా వచ్చిందన్న భావంతో వారు వ్యవహరిస్తున్నారు.

నిరుపమ పడుతున్న బాధలు సహించలేక సుందర రామయ్య చివరకు తాను కాపురముంటున్న ఇంటిని అమ్మి వాళ్ళ కట్నం తాలూకు డబ్బు ఇచ్చేద్దామని అనుకున్నాడు. ఇంటిని బేరం పెట్టాడు. ఆ విషయం ఇంట్లో తెలిస్తే వారు తమకు ఉండటానికి ఇల్లులేదని బాధపడతారు. అందుకని ఈ విషయం వాండ్లకు తెలియకుండా వుండుటకు మరల ఆ ఇంటినే అద్దెకు తీసుకుందామనుకున్నాడు.

కాని ఈ సంగతిని ఆయన ఎంత గోప్యంగా వుంచుదామనుకున్నా ఇంట్లో ఎలానో తెలియనే తెలిసింది. పిల్లా జెల్లా ఇంటిల్లిపాదీ సుందరరామయ్యను చుట్టేసి ఏడ్వసాగారు. తన పెద్దకుమారులు ముగ్గురికి పెండ్లిండ్లు అయాయి. సంతానం

కూడా కలిగింది. వారందరూ ఏమైనాసరే ఇల్లు అమ్మడానికి వీల్లేదని పట్టుబట్టారు. అందువల్ల ఇంటిఅమ్మకం ఆగిపోయింది. ఇక గత్యంతరం లేక సుందరరామయ్య ఎక్కడ దొరికితే అక్కడ పెచ్చు వడ్డీలకు నోట్లువ్రాసి వూరునిండా అప్పులు చేశాడు.

తనను చూడవచ్చిన తండ్రి ముఖకవళికలు నిరుపమకు ఆయన పరిస్థితిని తెలియచేశాయి. నెరసిన ఆ తెల్లని వెంట్రుకలు, వయస్సుకంటె ముందుగా ముంచుకొస్తున్న ముడుతలు పడిన ఆ ముఖం, ఆ మనోభావాలు ఆయన వెళ్ళబోస్తున్న దారిద్ర్యాన్ని చెప్పకనే చెపుతున్నాయి. చూస్తూ చూస్తూ తాను చేసిన పొరపాటుకు, ఇప్పుడు తను పడుతున్న పశ్చాత్తాపం కన్నబిడ్డముందర దాయాలంటే ఎలా దాగుతుంది!

అసలు నిరుపమ పుట్టింట నాలుగురోజు లుండి ఆయన వ్యధితహృదయానికి వూరట కలిగించి వద్దా మనుకుంటోంది. కాని ఆనాటికానాడు విచారంతో కుమిలిపోతున్న తండ్రిని చూచాక ఇక ఆయనకు దూరంగా వుండటం ఆమెకు మనస్కరించ లేదు.

ఒకసారి ఆమె తండ్రితో "నాన్నా, నన్ను మన ఇంటికి తీసుక వెళ్ళవా!" అన్నది. 'అలానేలే అమ్మా' అన్నాడు సుందరరామయ్య

మాటమాత్రం అంత తేలికగా అనగలిగాడు. కాని ఆమెను తీసుకవెళ్ళటానికి అక్కడ ఆయన పెత్తనమేముంది. వియ్యాలవారికి ఇవ్వవలసిన కట్నంక్రింద తను నిరుపమను వారికి తాకట్టు పెట్టినట్లయింది. దానిమూలంగా

కూతురిమీద కని పెంచిన మమతల్ని కూడా మరచిపోవాల్సి వచ్చింది. చివరకు ఆమెను చూచిపోవటానికికూడా వియ్యాలవారిని బిచ్చగాడిలా యాచించాల్సి వస్తోంది. వారు ఒకసారి లేదుపొమ్మని తిరస్కరిస్తే ఇంక అంతే. మళ్ళీ నోరు తెరచి అడగడానికికూడా వీలుండదు ఈ పరిస్థితుల్లో ఆయన కూతుర్ని ఎలా తీసుకుపోతాడు ?

కాని కన్నకూతురు తనకు తానుగా పుట్టింటికి వస్తానన్నప్పుడు తండ్రి అయినవాడు కాదని ఎలా నిరాకరించ గలుగుతాడు ? ఏమైనాసరే ఈసారి కూతుర్ని తీసుకువెళ్లాలనుకున్నాడు సుందరరామయ్య. అష్టకష్టాలుపడి, కాని వాళ్ల కాళ్ళూ గడ్డాలు పట్టుకొని వారి కట్నం తాలూకు మూడు వేలు ప్రోగుచేశాడు. ఆ డబ్బుకోసరం తాను పడిన బాధలు వియ్యాలవారికి తెలియనీయకుండా అతి గోప్యంగా వుంచాడు.

నోట్లను భద్రంగా మూటగట్టుకొని వియ్యంకుడి దగ్గరకు వెళ్ళి కూర్చున్నాడు. ముందర కొంచెంసేపు పిచ్చాపాటి లోకాభిరామాయణం కొనసాగిస్తూ మధ్యలో " బావా, మీకు యివ్వవలసిన పైకం ఇన్నాళ్ళూ ఇవ్వలేక పోయాను. వచ్చినప్పుడల్లా తృణమో పణమో సర్దుబాటు చేసిపోదామనుకుంటుండేవాడిని. కాని తీరా ఇక్కడకు వద్దామని ఇంటివద్ద బైలుదేరబోయే సమయానికి ఆ సంగతి గుర్తులేక మరచిపోతుంటాను. నాకా వృద్ధాప్యం, మతిమరుపూ రెండూవచ్చాయి " అని అన్నాడు. తను వచ్చినసంగతి చెప్పడానికి ముందుగా తను తెచ్చిన మూడువేల రూపాయలు సుందరరామయ్య రావుబహద్దర్ చేతిలో పెట్టాడు. ఆయన

ఆ నోట్లను లెక్కపెట్టుకొని పెదవి విరచి "బావా, మూడు వేలేనా! ప్రస్తుతం మాకేమీ అవసరాలు లేవులే. వీటిని నీదగ్గరే అట్టిపెట్టుకో! ముష్టి మూడువేల రూపాయలకోసం చెయ్యిచాచమంటావా?" అని దెప్పిపొడిచాడు అపహాస్యం చేస్తూ.

ఆయన మాటలు సుందరరామయ్య మనస్సును గాయపరిచాయి కొంచెంసేపు నోట మాట పెగల్లేదు. ఇంత జరిగాక ఇంకొకరికైతే పిల్లను పంపించమని అడగటానికి నోరు వచ్చేది కాదు. కాని పాపం సుందరరామయ్య ఏంచేస్తాడు? కూతురు పడుతున్న అగచాట్లకు ఆయన హృదయం తరుక్కుపోతోంది. ఆత్మాభిమానంకూడా చంపుకొని దీనాతిదీనంగా "అమ్మాయిని తీసుకెళ్ళదామని వచ్చాను; ఒకసారి పంపించండి. రెండుమూడు రోజు లుంచుకుని తిరిగి పంపిస్తాను." అని అడిగాడు. "పంపించటానికి వీలులేదు. ఇంతలో ఆ ఆశ ఏమీ పెట్టుకోకండి"అన్నాడు రావుబహద్దర్.

సుందరరామయ్యకు ఆ మాటవిన్నాక ఇక కూతుర్ని చూడటానికి ముఖం చెల్లలేదు. తెచ్చినడబ్బును కొంగునకట్టుకొని ఇంటికి తిరిగివచ్చేశాడు. డబ్బు ఇవ్వకుండా ఈసారి వియ్యాలవారి గడపత్రొక్కనని ఒట్టేసుకున్నాడు

ఆయన కూతురి దగ్గరకు పోక చాలాకాలమైంది. తండ్రిని ఒకసారి వచ్చి పొమ్మని నిరుపమ ఎన్నోకబుర్లు చేసింది ప్రత్యేకంగా మనిషినికూడా పంపించింది కాని సుందరరామయ్య వాళ్ళ కంటబడకుండా తప్పించుకొనేవాడు.

అందు కాతని హృదయం బాధతో నొచ్చుకోకపోలేదు. డబ్బులేకుండా కూతురింటికి పోకూడదనుకున్నాడు.

సుందరరామయ్య భార్యతో కఠినప్రతిజ్ఞ చేస్తూ "ఈసారి దసరాపండుగకు అమ్మాయిని తప్పక తీసుకువస్తాను. లేక పోతే నేను–" అన్నాడు.

ఆశ్వయుజమాసం వచ్చింది. దేవీనవరాత్రులు ప్రారంభ మయాయి. ఒకనాడు ఉదయాన్నే డబ్బుతీసుకొని కూతురు దగ్గరకు పోవడానికి ప్రయాణమయాడు. ఇంతలో ఒక మను మడువచ్చి ఆయన కాళ్లు చుట్టేసుకున్నాడు. వయస్సు అయి దేళ్ళుంటాయి. "తాతా, నాకు బండికొనుకొత్తానికెళ్త న్నావా!" అన్నాడు.

ఆ పసివాడు చాలాకాలంనుంచి రబ్బరుచక్రాల త్రోపుడుబండిమీద సాయంత్రం ఆరుబైట చల్లగాలికి తిరిగి రావాలని ఉబలాటపడుతున్నాడు. కాని ఎంత ప్రయత్నిం చినా అతని ఉబలాటం తీరేమార్గం కనిపించటంలేదు. "పండుగనాడు కట్టుకోవడానికి నాకు మంచి పరికిణీ, గాను లేవు తాతయ్యా!" అన్నది మరో ఆరేళ్ళ మనుమరాలు ఏడ్చుకుంటూవచ్చి.

సుందరరామయ్యకు ఈ బాధలన్నీ తెలియకపోలేదు. వాటిని గురించే ప్రొద్దస్తమానం ఆలోచిస్తున్నాడు ఆయన ఆలోచించేది ఒక్క సంసారపు ఈతిబాధల్ని గురించేకాదు. ఒకవేళ రావుబహద్దరుగారు నవరాత్రోత్సవాలకు రావలసిం దిగా ఆహ్వానించితే, తనకొడుకులు, కోడళ్ళు, మనుమలు మనుమరాండ్రు ఈమాయాలు గుడ్డలతో నగ నట్రాలేకుండా

దరిద్రుల్లాగ వాళ్ళింటికి పోవలసిందేనా? ఇక అంతకంటే వేరే గత్యంతరం లేదా? ఇలా వీటన్నింటిని గురించి ఆలోచిస్తున్నప్పుడు వెలువడిన వేడినిట్టూర్పుల పర్యవసానంగా సుందర రామయ్యలో వయస్సును మించిన వృద్ధాప్యపు చిహ్నాలు కనిపిస్తున్నాయి.

ఒకవంక దారిద్ర్య పిశాచికి బలై పోతున్న తన సంసార పరిస్థితిని చూస్తూనే సుందరరామయ్య వియ్యాలవారింట్లో అడుగుపెట్టాడు. కంచుకాగడా వేసి వెదకినా నేడాతనిలో సంకోచమనేది ఏకోశానా కానరావడంలేదు. రావుబహద్దర్ గారిదాకా పోవడమెందుకు! ఇంతకుమునుపు వారి నౌకర్లు గేటుజవానులను పల్కరించటానికే భయమేసేది. ఈనాడా భయాలేమీలేవు. కనుక తన స్వగృహంలాగా నిర్భయంగా సరాసరి లోపలికే వెళ్ళాడు. కాని రావుబహద్దరుగారు ఇంట్లో లేరు. ఇంకోగంటకుగాని రారని తెలిసింది. హృదయాతురత నాపుకోలేక సుందరరామయ్య ఎకాఎకి వెళ్ళి కూతుర్ని కలుసుకున్నాడు. హర్షాతిరేకంలో ఇద్దరికండ్లనుండీ ఆనందాశ్రువులు జలజలా రాలాయి. ఇద్దరిలోఒక్కరికీ మాట పెగల్లేదు. గదంతా నిశ్చేష్ట నిశ్శబ్ద నీరవవాతావరణం అలుముకుంది సుందర రామయ్య చాలాసేపటికి "నిన్ను తీసుకవెళ్ళటానికి ఇక ఏ అడ్డంకులూలేవు. నిన్నీసారి తప్పక మఇంటికి తీసుకెళ్ళితీరతానమ్మా!" అన్నాడు.

ఇంతలోనే సుందరరామయ్య పెద్దకొడుకు హర మోహన్ తన ఇద్దరు పిల్లల్ని వెంటేసుకొని అకస్మాత్తుగా

అక్కడికి వచ్చిపడ్డాడు. "నాన్నా, ఇకమేము బజార్ల వెంట తిరిగి ముష్టెత్తుకొని బ్రతకాల్సిందేనా!"అన్నాడు తండ్రితో.

సుందరరామయ్య హరమోహన్ మీద కోపంతో భగ్గున మండిపడ్డాడు "అయితే మీ కోసం నన్ను పాపం మూటకట్టుకొని నరకానికి పొమ్మంటారా? మీరు నన్ను నా మాట నిలబెట్టుకోనీయరా!" అన్నాడు

సుందరరామయ్య ఈ సారి నిజంగానే ఇల్లు అమ్మేశాడు. మనుమడుకూడా తాతమోకాళ్లు రెంటినీ వాటేసుకొని "తాతయ్యా, నా బండి-" అన్నాడు. వంచిన తలెత్తకుండా అలానే నిలబడ్డాడు సుందరరామయ్య. తాతనుండి ఏ జవాబు రాకపోయేసరికి నిరుపమ దగ్గరకు పరుగెత్తికెళ్ళి "అత్తయ్యా, నాకో బండి కొనిపెట్టవా!" అన్నాడు మేనల్లుడు. నిరుపమకు సంగతి సందర్భాలన్నీ అర్థమయాయి. "నాన్నా, ఇక నీవు నా కట్నంక్రింద ఒక్కదమ్మిడీ అయినా మా మామకిచ్చావా! ఇదిగో నీ సాక్షిగా ఒట్టేసుకొని చెపుతున్నా ఆ తర్వాత నీ కూతుర్నిక సజీవంగా చూడలేవు" అన్నది.

సుందరరామయ్య:- "తప్పమ్మా! అలా అనకూడదు. నీ కట్నం డబ్బియ్యకపోతే వచ్చే అగౌరవం నా ఒక్కడికే కాదు. నీకూ వస్తుంది."

నిరుపమ:- "డబ్బివ్వక పోవడం కాదగౌరవం. అసలు డబ్బివ్వడమే అగౌరవం. నీ ఈ కూతురికి ఆ మాత్రం మానాభిమానాలు లేవూ? రూపాయలున్నంతసేపే విలువ

వుండటానికి నే నేమన్నా రూపాయల సంచి ననుకున్నారా? నాన్నా! నేనూ మనిషినే. నాకూ మానాభిమానాలు, ఆత్మ గౌరవం వుంది. రూపాయలు ఇవ్వటానికి వీల్లేదు. నాన్నా! డబ్బిచ్చి నీవు నన్ను అగౌరవపరచకు. అసలు నీ అల్లుడు నిన్ను డబ్బిమ్మని అడగటంలేదుగా. మధ్య వీళ్ళతో నీ కెందుకు?"

"అమ్మా! అయితే వీళ్ళసలు నిన్ను పుట్టింటికే పంపి చరుగా?"

"పంపించకపోతే పోనీ. నీ వేంచేస్తావు? నన్ను తీసుక వెళ్ళటానికి నీవుకూడా రాకుండా వుంటేసరి."

సుందరరామయ్య కంపిత హస్తాలతో డబ్బుమూట తీసుకొని దొంగవానిలా రెండోకంట బడకుండా మళ్ళీ వచ్చినదార్నే ఇంటికి తిరిగొచ్చేశాడు.

కాని సుందరరామయ్య కట్నం డబ్బివ్వడానికి తీసుకొచ్చికూడా కూతురు ఇవ్వవద్దని బలవంతంచేస్తే ఇవ్వకుండానే తిరిగి వెళ్ళిపోయాడన్న విషయము బయటకు పొక్కకుండా దాగలేదు. గోడలకు చెవులుంటాయిగామరి! దాసీ దొకతె గోడప్రక్కనే నిలబడి ఈ మాటలన్నింటిని ఆలకించి వెళ్ళి నిరుపమ అత్తతో చెప్పేసింది. ఇంకేముంది! ఆమాటలు విసీ వినటంతోనే ఆజ్యం పోసిన అగ్గిలాగా నిరుపమమీద భగ్గున మండిపోయింది అత్త. నాటినుండి అత్తగారిల్లు నిరుపమకు అంపశయ్యలాగ తయారైంది. వివాహమైన కొన్నా

ళ్ళకే డిప్యూటీ మేజిస్ట్రేటయి నిరుపమభర్త పరాయివూరు వెళ్ళాడు. దా న్నాధారంగా తీసుకొని సహవాసదోషంవల్ల తమ కుమారుడు భార్యమాటల్లో పడి తమమాట వినడేమో నని తలిదండ్రులు అత న్నసలు ఇంటికి రానీయకుండానే మాన్పించేశారు.

ఈమధ్య నిరుపమ పెద్దజబ్బున పడింది. కాని ఆదోష మంతా కేవలం ఆమె అత్తఒక్కదాని నెత్తినవెనే రుద్దటం సమంజసంగాదు. ఆమె అతి నిర్లక్ష్యంచేసింది. కార్తీక మాసంలో అదీ బాగా మంచుపడేరాజుల్లో, రాత్రి తెల్ల వార్లు తలుపులు తెరచి దుప్పటి కప్పుకోకుండానే పడుకునేది. అన్నంకూడా సరిగ్గావేళకు తినేదికాదు. దాసీ లొక్కొక్క ప్పుడు ప్రొద్దున్నే ఫలహారం తెచ్చిపెట్టడం మరచిపోతే వాళ్ళకు కనీసం గుర్తన్నా చేసేదికాదు ఈ ఇంట్లోఉన్న దాసీ లందరితోపాటు తాను ఒకదాసీదాన్నని వాళ్ళలాగే యజమాని యజమానురాండ్ర దయా ధర్మ బిక్షాలమీంద ఆధారపడి తానూ జీవితం వెళ్ళబోస్తున్నాననేభావం ఆమె మనస్సులో గాఢంగా నాటుకుపోయింది. కాని అలా దాసీ లాగా పడివుంటున్నాకూడా అత్త సహించివూరుకొనేది కాదు. పొద్దస్తమానం ఏదో ఒకటి ఎత్తిపొడుస్తూనే వుం టుంది. ఒకొక్కపూట కోడలు భోంచేయకపోతే– "ఓహో, దొరసానిగారామె! ఆమెగారికి ఈ దరిద్రు,లింటి కూడెందుకు సహించుతుందిలే!" అనేసేది ఎద్దేవగా.

ఆఖరి కొకరోజున నిరుపమ అతివినయంగా "అత్తయ్యా! నాన్నను, అన్నయ్యను ఒకసారి పిలిపించవా" అన్నది. "ఆ-చూద్దువుగానిలే వుండు! పుట్టింటికి పోవటానికి ఇదొక ఎత్తా!" అని అన్నది అత్త.

నిరుపమ ఆరోజు సాయంత్రం మృత్యుదేవతతో అంతిమపోరాటం సలుపుతోంది. ఆరోజే ఆమెను తొలిసారిగా డాక్టరు వచ్చి పరీక్షించాడు. చివర కామె వైద్యానికి మొదలు తుదికూడా ఆరోజే అయింది. నిజాని కిది నూటికి నూరుపాళ్లు వాస్తవమే అయినా, అలా జరిగిందని చెప్పితే దాన్నెవరూ విశ్వసించరు.

ఇంటి పెద్దకోడలు నిరుపమ స్వర్గస్తురాలైంది. రావుబహాద్దరుగారి పేరు ప్రతిష్టలతు తగ్గట్టుగా! వివాహం ఎంత పెద్ద ఎత్తున జరిగిందో అంతకంటే ఇనుమిక్కిలిగా జరిగాయి నిరుపమ అంత్యక్రియలు. అటువంటి మంచి గంధపు చెక్కల చితి నెవరూ ఇంతవరకు ఆ వూళ్ళో చూడనే చూడలేదట. ఆమె శ్రాద్ధ కర్మలు నిర్వర్తించటం కోసం రావుబహాద్దరు కొద్దిగా అప్పుకూడా చేశాడని వినికిడి.

సుందరరామయ్యను ఓదార్చేందుకు ఇరుగు పొరుగుల వాళ్ళు నిరుపమ అంత్యక్రియ లెంత అట్టహాసంగా జరిగాయో వర్ణించి చెప్పేవాళ్ళు.

"నే నిక్కడ ఇల్లు వగైరా ఏర్పాట్లన్నీ చేసుకున్నాను. వెంటనే నా భార్యను పంపించండి" అని డిప్యూటీ మేజిస్ట్రేటుగారివద్దనుంచి వుత్తరం వచ్చింది.

రావు బహద్దరుగారి సతీమణి "అబ్బాయీ! నీ కోసం ఇంకో అమ్మాయిని మాట్లాడి లగ్నం నిశ్చయించాం. నీవు శెలవు పెట్టి వెంటనే బయలుదేరి రావలసింది" అని తిరుగు జాబు వ్రాయించింది.

అబ్బాయి కట్నంక్రింద ఈసారి ఇరువదివేల రూపాయల నగదు అప్పటి కప్పుడే కళ్యాణమంటపంలోనే వసూలు అయింది.

